శ్రీశారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక


కీలక వరాఘ ఫాల్గుణములు

సంపుటము 57 సంచిక 6




సంపాదకుఁడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర, బ్రాహ్మీభూషణ **కాకరపర్తి కృష్ణశాస్త్రి**


సంవత్సరమునకు చందా రు. 3/—

విడిప్రతి 0-60 పైసలు.

# ఆంధ్ర సాహిత్య పరిషత్తు

ప్రతిష్ఠాపకులు:

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ, డి. లిట్., పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు.
జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

## కా కి నా డ

అ ధ్య క్షు లు

విమర్శకాగ్రేసర, ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అ భి న వ భో జ

దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
6. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ.,
7. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ., (ఆనర్సు)
8. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ వోలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
9. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్.,
10. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు
11. శ్రీ చిరువోలు వెంకట రామమూర్తిగారు

# విషయసూచిక


కీలక మాఘ ఫాల్గుణములు

సంపుటము ౪౫ సంచిక ౬

# సంపాదకీయము



పత్త్రికా సంపాదకుఁడు.

మ. అకలంకం బగునాంధ్రమందు రచనావ్యాపారముల్ సల్ప దా
వకవిద్యామయగద్యపద్యకలితవ్యాసావళుల్ పత్త్రికన్
బ్రకటింపంబడు; వ్యావహారికము లౌవ్యాసంబులున్ పద్దెముల్
ప్రకటింప న్వల దంచు పారిషదపూర్వస్థాపకాదేశముల్.

తే. గీ. ఆంధ్రపండితులార ! మీ వ్యాసవితతి
విడివిడిగ నక్కరంబులు వెలయఁజేసి
సంధులు ఘటించి యపశబ్దసరణి వీడి
పత్రముల కొక్కప్రక్కనే వ్రాయుఁ డయ్య !

ఆ. వె. భావకవితగాని, వ్యావహారికభాష
గాని, సంధిరహితమైన, దుష్ట
సంధికలితమైన, ఛందోరహితమైన
పద్యపాళిఁగాని పంపవలదు.

చ. మనమున దోషమంచు ననుమానము గల్గ సనాతనాధునా
తనకృతులందు వానిని యథావిధి ఖండన మాచరించి మా
కనుపుడు వ్యాస; మాకవుల నక్రమదూషణముం బొనర్పఁగా
జన దిసుమంతయైన; కృతిసంగతదోషములే లిఖింపుడీ !

మ. భవదీయం బగుఖండనంబు గని యెవ్వారైన సత్పండిత
ప్రవరుల్ ఖండనముండనంబులొనరింపన్ వాటినింగూడ మే
మవికల్పంబుగ ముద్రణం బొనరుపన్ న్యాయం బటం చెంచి తె
ల్పవలెం గావున దెల్పుచుంటి మిటు లాపై మీరు యోజింపుడీ !

ఉ. బాసలనన్నిటం దెనుఁగుబాసయె లెస్స యటంచు బాండితీ
భాసురసత్కవీశ్వరుడు వల్కెఁగదా మును వానివాక్యముల్
దోసి సదోషవాక్యములతోడుత బద్యములన్ రచించుచో
నీ సగుణాంధ్రదేశము వహింపకయున్నె యశోవినాశమున్.

ఉ. భారత దేశరాష్ట్రములభాషల కన్నిట నొండె యొండె చాల్
నేరువ వానివ్యాకరణనిస్తులపద్ధతి; కాని యాంధ్రవా
క్సారము గోరుకొన్నయెడ జాలదు వ్యాకరణైకమాత్రమే
హారితరామరాంధ్రములవ్యాకరణద్వయి నేర్వగానగున్.

ఆ. వె. ఈప్రపంచభాషలెల్ల తెలిక నేర్వ
నాంధ్రభాష కష్ట మాకళింప
నక్షరములు మితము లఖిలభాషలఁ గాని
యాంధ్రభాషయందు నమితతమము.

తే. గీ. అమితశాస్త్రీయపద్ధతి ననుసరించి
పద్యములు గద్యములు వ్రాసి పంపుడయ్య!
ఆంధ్రసాహిత్యపరిషత్తు నమితవృద్ధి
కలిత మొనరింపు డాంధ్రసత్కవులు మీరు.

ఇట్లు,
ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రికా సంపాదకుఁడు
కాకరపర్తి కృష్ణకవిమూర్ధన్యుఁడు.



# జగద్గురు ప్రశంస

శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రి

మ. వనులన్ దుర్గమకందరాంతరములన్ వాసంబు గావించి గా
లిని పర్ణంబుల గందమూలముల నోలిం బొట్టలం బోసికొం
చును జీవించుమహర్షివర్యుల సుధీసుప్తాద్వయజ్ఞానబో
ధను సర్వావని బాహిరించితివిగాదా! శంకరార్యోత్తమా!

మ. వికటాసన్మత దుష్ప్రచారకులతో వివాద మత్యంత; మిం
కొకవేళన్ నిగమాంతరార్థపరిపూర్ణోద్గ్రంథసంసృష్టి; యిం
కొకవేళన్ బటురోగయోగమును నయ్యో! నిన్ను బీడింప జం
కక కొన్నావు "జగద్గురుం" డనుఘనాఖ్యన్ షణ్మతోద్ధారకా!

మ. భవదీయాప్రతిమానబుద్ధివిభవప్రావీణ్యసంపాదకుల్
భువి నెవ్వారు గలారు? వేదగతసంపూర్ణాత్మబోధామృతం
బు విశేషంబుగ దా ముఖాముఖిని సమ్మోదమ్మునన్ గ్రోలుశి
ష్యవితానంబు సురేశ్వరప్రముఖ మాహా! తక్క నింకొక్కడున్.

ఉ. నీ సరివారు లేరెపుడు నేర్చితి వాగమసర్వశాస్త్రముల్
వ్రాసితి వెవ్వ డీనిఖిలగ్రంథము? లెవ్వ డసన్మతవ్రజో
ద్వాసన మాచరించి మఠవర్గము స్థాపనచేసినావు దే
వా! సుకృతీగతాయు వనువాక్యమె నిక్కువ మేమిచెప్పుదున్.

మ. అపుడే పుట్టుక; యప్పుడే చదువు; సన్న్యాసంబు నప్డే; జయం
బపుడే; గ్రంథవికల్పనంబు నపుడే; యాత్మప్రబోధక్రమం
బపుడే; తోటకపద్మపాదముఖశిష్యాప్తుల్ మఠస్థాపనం
బపుడే; యప్పుడె ముప్పదేడులకె నూరబ్దంబులు న్నిండుటల్.

మ. అనుభూతిశ్రుతియుక్తి నుక్తులు మిథోఽత్యంతావిరోధంబులై
తనరారన్ విరచించి భాష్యముల ప్రస్థానత్రయంబున్, జనం
బున కందించితి వెట్లుతీర్తుము ఋణంబున్ స్వామి! నా డీవు పె
ట్టినభిక్షల్ సుమి నేటికిన్ మెసవుచుండెన్ జ్ఞానిలోకావళుల్.

ఉ. మండనమిశ్రుని న్నిరుపమానగతి న్సకలోరుశాస్త్రస
త్ఖండనముండనంబుల నఖండసుతార్కికధీవిశాలతో
ద్దండత బాండితీవిభవదర్పముచేత జయించి యాతనిన్
దండిగ మార్చ నేర్చినయతండు జగద్గురుఁడంట చెల్లదే!

శా. ఏ వర్ణాశ్రమవాసియైన సరియే యీ జ్ఞానమార్గంబునం
దే వర్తించిన మాయ మాయమయి సందేహంబపేతంబునై
జీవన్ముక్తి లభించు నంచును వచించెన్ శంకరుం డొక్కరుం
డే వాయించుచు భేరికన్ విమతవాదీంద్రాతిభీహేతువున్.

శా. ధైర్యారూఢి సుఖింపుమా భరతమాతా! నాడు శ్రీశంకరా
చార్యున్నీకడుపార గంటి వికనాచంద్రార్కమున్ దుర్మత
క్రౌర్యాలాపమహార్భటిన్ మది దలంకంజెల్లుకాలంబు దా
నిర్వాణంబును జెందె; జ్ఞానమహిమల్ నిండె న్సమస్తాశలన్.

ఓమ్. ఓమ్. ఓమ్.



# బట్టుమూర్తి - మూర్తికవి

శ్రీ పేకుమళ్ల కామేశ్వరరావు, బి. ఏ., బి. ఇడి.

( గత సంచికానుబంధము )

పై యిద్దఱు కవులును ప్రబంధాంకమువారె. తాతపేరు ఒక్కటె. కాని తండ్రులపేర్లు భిన్నముగా నున్నవి. వసుచరిత్రకర్త తండ్రికి పెద్ద ప్రసిద్ధిలేదు. అట్లుగాక మూర్తికవి తండ్రియైన వేంకటరాయభూషణుఁడు ప్రసిద్ధుఁడు. అట్లు వారితండ్రులు వేర్వేఱు. వారి వంశవృక్షమిట్లున్నది.




బట్టుమూర్తి (రామరాజభూషణుఁడు) | మూర్తికవి (శారదామూర్తి)

వెంకటరాయభూషణుఁడు అనునది బిరుదనామము. కృతిపతియైన నరసరాజువంశములో వెంకటరాజు, ఎఱ్ఱవెంకటరాజు అను వారలున్నారు. అళియరామరాజుయొక్క ఆఖరిసోదరుఁడు వెంకటాద్రి. అట్లే మరికొందఱు వెంకటరాయ నామధారులున్నారు. కాఁబట్టి వేంకటరాయ భూషణుఁడను బిరుదెవరివలన వచ్చినదో తేలదు.

మూర్తియొక్క జనకతండ్రిపేరు సూరపరాజనియు, దత్తతతండ్రిపేరు వేంకటరాయ భూషణుఁడనియు చెప్పెడి ఈ వింతపద్యము నే మహానుభావుఁడో సృష్టించి విడిచిపెట్టినాడు-

తే. తా రచించిన వసుచరిత్రమునఁ గన్న
తండ్రిసూరన వెలయించి, తలపడయ్యె
నన్న, మన శారదామూర్తి; నాఫలంబె?
దత్తుఁడగువానిఁ జేపట్టదరమె నాకు!

అది తప్పుల తడిక. ఆ కవుల భేదాభేదవివాదములు బయలుదేరిన పిమ్మట పుట్టినపద్యమువలె కనఁబడుచున్నది.

ఇంకొక ప్రశ్నకు సమాధానము బాకీయున్నది. వసుచరిత్ర, నరసభూపాలీయములలో కొన్ని పద్యభాగములు, భావములు సమముగాఁ గనఁబడుచున్నవి. అది యెట్లు తటస్థించెను? ఆ యన్నదమ్ము లిద్దఱును ఒకరితో నొకరు సంప్రతించుకొనుచునే కావ్యరచన చేసి యుండుటచేత నట్టిసమత్వము సంభవించినది. ఆ రెండును ఏకకాలమందు పూర్తియైన గ్రంథములేయని యిదివఱకె మనవిచేసియుంటిని.

## 14. ఆ కవుల స్వస్థలమేది?

ఆ యిద్దఱికవుల ఇంటిపేరు ప్రబంధాంకమువారు. వారి స్వగ్రామ మేదో తెలియవలసియున్నది. రామరాజభూషణుని స్వస్థలము కావచ్చునని చెప్పెడి గ్రామములు— (1) బళ్లారిజిల్లాలో పాలమండలమునకు సమీపమున బట్టుపల్లె గలదు. (2)[24] కడపమండలములో పులివెందుల తాలూకాలో నొక బట్టుపల్లె యున్నది. (3) గుంటూరు జిల్లాలోని చుండూరు సమీపమున నున్న మోదుకూరు (4) గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని భట్టురాజుల పురము (5) ఒక గ్రామము జటప్రోలుచెంత గలదని సురభవంశ చరిత్రకారులు చెప్పుచున్నారు. భట్టుమూర్తి జన్మస్థలమును గుఱించి వైయాకరణము గోపాలజయదేవ రాజుగారు[25] కొంత పరిశోధన చేసిరి. బట్టుమూర్తి, మూర్తికవులు

24. కావలి వెంకటరామస్వామి 1829 లో చెప్పిన సమాచారము.

25. వీరు పరిశ్రమచేసి ఆంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక (1919) లో వేసిన వ్యాసము, పుట 125.

వేఱను వారిలో వీరొకరు. ఆ కవుల జన్మస్థలము పల్నాటి తాలూకా లోని బట్టురాజుల పురమనియు, అచ్చట మాత్రిమె ప్రబంధాంకమను యింటిపేరుగలవారున్నారనియు వీరనుచున్నారు. అదియే కావచ్చును.

## 15. కవిద్వయము జీవితాంశములు

బట్టుమూర్తి, మూర్తికవులు అన్నదమ్ముల బిడ్డలని తెలిసినను, వారి తండ్రిలలో చిన్న పెద్దలెవరో, తల్లుల పేర్లేమో, ఆ కవులిద్దఱిలో పెద్దయెవరో, చిన్నయెవరో తెలియదు. కాని మూర్తికవి చిన్నవాఁడనియు, బట్టుమూర్తియే పెద్దవాఁడనియు తోఁచుచున్నది. బట్టుమూర్తి జననము క్రీ. శ. 1495 కాగా, మూర్తికవి పదేండ్లు చిన్నవాఁడై 1505 లో జన్మించి యుండవచ్చును. ఆ అన్నదమ్ములు జ్ఞాతి వైరములేక రామలక్ష్మణులవలె పెరిగిరనవచ్చును.

ఆకవు లిద్దఱును తమ కవితాగురువులను దలపెట్టలేదు. తమ తండ్రితాతలే గొప్ప పండితులుకాగా, విద్యాభ్యాసమును వారివద్దనే చేసియుందురు. కాఁబట్టి వేఱుగా గురుస్తుతి కనఁబడదు. అయినను బట్టుమూర్తి అల్లసాని పెద్దన్నగారి శిష్యుఁడను ప్రతీతియున్నది. అతఁడు పెద్దనకవిచుట్టును ప్రదక్షిణములు చేసి, కృష్ణరాయల యాస్థానము లోఁ బ్రవేశార్హతను సంపాదించుకొని, తన ప్రతిభవల్లదానిని నిల ద్రొక్కుకొనియున్నాడని చెప్పవచ్చును. పెద్దవయస్సు లేకున్నను అష్ట దిగ్గజములలో నొక్కఁడై వెలసియున్నాడు. అల్లసాని పెద్దన్న, ముక్కు తిమ్మన్న, మాదయగారి మల్లన్న, ధూర్జటి ముదురుకవులు కాగా, తెనాలిరామలింగడు, అయ్యలరాజు, రామభద్రుఁడు, పింగళి సూరన్న బట్టుమూర్తి లేతకవులై యుందురు. రాధామాధవ కవి, తాళ్లపాక కవులు, కంసాలి రుద్రయ్య మొదలగువారు పైవారివలె ప్రధానులు గారు. కృష్ణరాయభూషణుఁడను కవి యొకఁడున్నాడని[26] పైడిమఱ్ఱి

---

26. ఆంధ్రకవి తరంగిణి, సం 11-182.

వెంకటపతి వ్రాయుచున్నాడు. పేరునుబట్టి యతఁడు కృష్ణదేవరాయని యాస్థానమువాడె యని చెప్పలేము. ఆనాడు కృష్ణరాయనామధారులు మఱికొందఱున్నారు.

బట్టుమూర్తి వసుచరిత్రలో "కృపాణకృష్ణా నిర్మథ్యమానరణార్ణవసముత్పన్నవిజయలక్ష్మీ..." అని శ్లేషలో పేర్కొన్నవ్యక్తి కృష్ణదేవరాయలు మాత్రమె.

ఆస్థానములో అగ్రగణ్యుఁడైన అల్లసాని పెద్దన్నతో పాటు ధైర్యముగా నుత్పలమాలికను జెప్పఁగలిగిన ధీరుఁడు బట్టుమూర్తి. పెద్దన్న మహాకవికాగా, బట్టుమూర్తి మహాపండితుఁడు. ఆ యుత్పలమాలికలోని కడపటిచరణము—

రట్టడిబట్టుమూర్తికవి

రాయనిమార్గ మెఱుంగ జెప్పితిన్.

అని యున్నది. రట్టడి అనగా రెడ్డి లేక గ్రామమునసబు అని యర్థము. ఏదో గ్రామమునకు బట్టుమూర్తి మునసబై యుండును. అతనికి ఆనాటికె కవిరాజను బిరుదున్నది. ఈ కవిరాజు ఎంతబట్టయినను, సమయము వచ్చినచో ఆత్మగౌరవమును నిలబెట్టుకొనును. ఏదియో సందర్భమున తిమ్మరుసుమంత్రి యీ కవిని నొప్పించినాడు. అంతట బట్టుమూర్తి తిరుగబడి, తిమ్మరుసుమంత్రి "బలు దుర్గాధీశు తాంబూలపుం దిత్తుల్ మోసిన" కథను బైటబెట్టినాడు.

బట్టుమూర్తికిఁ గిన్కరెట్టింపఁ, బచ్చల
హారమర్పించె దిమ్మరుసుమౌళి.

అట్లు కవిరాయని నోరు కట్టివేసినాడు మంత్రిరాయఁడు.

కృష్ణదేవరాయని కాలమున బట్టుమూర్తి సంతరించిన కావ్యములు వెలుగుఁ జూడలేదు.

## బట్టుమూర్తి - మూర్తికవి

కృష్ణదేవరాయలు 1530లో అస్తమించినాడు. నామకః చక్రవర్తి యైన అచ్యుతదేవరాయలు కవితాస్థానము నెప్పటివలె కొనసాగించినాడు. అయినను ముఖ్యమైన కవులు వేర్వేరు ఆస్థానములను జూచుకొన్నారు. కేంద్రస్థానదర్శన మప్పుడప్పుడు మాత్రమే చేయుచుండిరనవచ్చును.

బట్టుమూర్తి రామరాయల దండనుబట్టి విజయనగరములోనె యుండినాడు.

మూర్తికవికి బట్టుమూర్తివలె పూర్తిగా విజయనగరనివాసము లభింపలేదు. అతఁడు పోచిరాజు నరసరాజునకు నాశ్రితుఁడుకదా ; నరసరాజు కర్నూలు జిల్లాలోని తొరగంటిపురాధ్యక్షుఁడు. అతఁడు రాజధానిని దర్శించినప్పుడు, మూర్తికవిగూడ వెంటనుండుట రివాజు.

బట్టుమూర్తి, మూర్తికవులు హనుమద్భక్తులు. బట్టుమూర్తి యొక్క రామభక్తికి రామరాజభక్తియె ప్రధానము. అతఁడు "శ్రీరామపదారవిందభజనానందున్" అని పలికినపలుకులు శ్లేషగలవి. రామరాజున కంకితమిచ్చిన గ్రంథములుగూడ నేటివఱకు బైటపడలేదు. తళ్లికోటనాటి లంకాదహనమునకు సమిధలై యుండును.

బట్టుమూర్తి ప్రసిద్ధి తిరుమలరాయని చెవులదాక బోయినది. అతఁడు బట్టుమూర్తిని సన్మానించి వసుచరిత్ర నంకితముబొంది తన పేరును చిరస్థాయి చేసుకొన్నాడు. అంతట బట్టుమూర్తికి మఱియొక దేవుఁడు కుదిరినాడు. "వేంకటేశ్వరానుగ్రహ నిరుపాధికైశ్వర్య నిత్యయశుఁడై"నాడు.

విజయనగరములో వసుచరిత్రను అంకితమిచ్చు సభ యేర్పాటైనది. తెనాలిరామలింగఁడు ఇంతబూడిద ముందు పోసుకొని, వేలందులో పెట్టుకొని, అక్షరాభ్యాసము చేయువానివలె కూర్చున్నాడు. బట్టుమూర్తిని "శ్రీ భూపుత్రి" యను మంగళాచరణపద్య

మును చదువనిచ్చినాడు. రామలింగకవి బూడిదమీద వ్రాసి, ఊపిరి బాగా పీల్చి, 'శ్రీ భూ' అంటూ ఒక్కపెట్టున ఊదినాడు. దుమ్ము లేచి పక్కవారి కళ్ళలో పడినది. అతని హాస్యమును సభ్యులానందించినారు. కావ్యపఠనము కొనసాగినది. గిరికాదేవి విచారఘట్టము పూర్తి కాగా, రామలింగఁడు లేచి-

అల్లసాని పెద్దన్న యటునిటు నేడ్చె
ముక్కుతిమ్మన్న ముద్దుముద్దుగా నేడ్చె
బట్టుమూర్తి బావురని యేడ్చె.

నని సానుభూతిగా నేడ్చినాడు. సభాసదులు పొట్టలు చెక్కలగునట్లు నవ్వినారు.

ప్రథమములో మూర్తికవి, అయ్యలరాజు రామభద్రకవియు డీకొన్నారు. కాని పిమ్మట శారదకవి ప్రాణమిత్రుఁడైనాడు.

బట్టుమూర్తి రామనామమును తనబిడ్డలకు బెట్టుకొన్నాడు. రామచంద్రపురాగ్రహారమును నిర్మించినాడు. శ్రీ రామకోవెలను గట్టించినాడు. కాని ఆ స్థలములు మనకుఁ దెలియవు. అల్లైరామచెఱు వెక్కడనున్నదోకూడ తెలియదు. అతఁడు హరిశ్చంద్రనలోపాఖ్యానమును (అవతారిక 14) వ్రాసి శ్రీరామునకు నంకితమిచ్చి, సాధుజీవనము చేసినాడనవచ్చును.

ఆకవు లిద్దఱును రాజాశ్రయమువల్ల అగ్రహారాదికమును సంపాదించుకొన్నారు. ఏ కొదువలేదు.

1565 లో విజయనగరసామ్రాజ్యమునకు ప్రళయము సంభవించినది. శత్రువులు విజయినగరమును ఆరునెలలపాటు దోచుకొనిరి. వారు వేడినీటి స్నానముకై తాటాకుపుస్తకములను తగులబెట్టిరి. మహాకవుల రచనల నట్లు సన్మానించిరి !

ఆ ప్రళయసమయమందు ఆ కవులిద్దఱును తమ యగ్రహారము లలో తలదాచుకొని యుందురు. శిష్యులకు చదువుచెప్పుకొనుచు కాలము గడిపియుందురు.

16. తిరుమలరాయలు

తిరుమలరాయలు ప్రారంభమందు ఆనెగొండకోటకి ప్రభువు. అతని ప్రోత్సాహమున[27] కొండరామకవి గవిరంగనాథశతకమును వ్రాసినాడు. గవిరంగనాథుఁడను నది దేవుని పేరు. ఆదేవుఁడు గజ పురములో నున్నాడు. వేదము విమర్శకులు, గవిరంగనాథుఁడు అనంత పురము జిల్లాలోని ఒకగుట్టలోనున్న దేవుఁడు కావచ్చునని యూహించి గజపురమేదో తెలియలేదన్నారు. గజపురము ఆనెగొందియె కాని (ఆనె=గజము, గొంది=పురము) మరియొకటి కాదు. కవి యట్లు సంస్కృతీకరించినాడు. ఇంక గవిరంగనాథుని గుఱించి యేమనగా—[28]ఆనెగొందికి ఒక మైలుదూరములో నున్న ఒక కొండలోని దేవునకు గవిరంగనాథస్వామి యనిపేరు. ఇంక మరియొక ముఖ్యమైన విషయ మేమనగా, ఆ శతకములో ముచ్చటగా మూఁడు సీసపద్యములలో ఆ నాఁటి విజయనగరరాజధాని వైభవము వర్ణింపఁబడినది. తిరుమల రాయఁడు 'మన్మథసుందరుఁడు' కాని కన్నుపోగొట్టుకొన్నవాడు కాదు.

సామ్రాజ్యపు టుత్తరపుసరిహద్దు రక్షణకై తిరుమలరాయలు పాలకునిగా జేయఁబడెను. అది కృష్ణరాయని కడపటిదినములలో 1530 ప్రాంతములో జరిగియుండును.

అచ్యుతదేవరాయల కాలములో ప్రభువులలో అంతర్యుద్ధము సంభవించినది. అళియరామరాయలు, తన తమ్ములతోగూడ రక్షణము

---

27. శతకవాఙ్మయసర్వస్వము, వేదము వెంకటకృష్ణశర్మ రచితము 1954, పు 126.

28. బెంగుళూరి సూర్యనారాయణరావుగారు ఆంగ్లములో వ్రాసిన విజయ నగరచరిత్ర, 1905, పీఠిక, పు. 15.

నకు బోయి, పెనుగొండను కేంద్రముగాఁ జేసుకొని, తిరుమలరాయుని నధిపతిగా జేసి, తాను యుద్ధసన్నద్ధుఁడై విజయనగరమును జేరుకొన్నాడు. [29]తిరుమలరాయలు ఉదయగిరి 1543-51 కొచ్చెర్లకోట, కొండవీటి (1558) లో కాలక్షేపము చేసినాడు. తళ్లికోటయుద్ధమునకు పిమ్మట పెనుగొండలో నుండినాడు. కాని శత్రువుల దాడులు ముమ్మరము కాగా, చంద్రగిరిని చేరుకొన్నాడు. అతఁడు రాజ్యపునర్నిర్మాణమునకై తీవ్రకృషి చేసినాడు. సామంతుల యజ్ఞానమువల్ల తగిన ప్రతిఫలము కలుగలేదు. అతఁడు 1575 ప్రాంతములో శాశ్వతముగా కన్నుమూసినాడు.

## 17. ముగింపు

మూర్తికవి వ్రాసిన నరసభూపాలీయము చక్కని కవిత్వముతో విరాజిల్లుచున్నది.

బట్టుమూర్తి రచించిన వసుచరిత్ర ప్రఖ్యాతిగాంచినది. అల్లసానివాని మనుచరిత్ర కథాప్రధానరచన. బట్టుమూర్తి భాషాపాండిత్యమును, రసమును మిళావుచేసి వసుచరిత్రను సృష్టించినాడు. అది యొక నూతనశైలి. మనుచరిత్ర ప్రపంచమందలి యుత్తమపద్యకావ్యములలో నొకటి. అట్టి గ్రంథముతో పోటీగా నిలబడిన వసుచరిత్ర నిజముగా మెచ్చుకొనఁదగినదే! భాషాప్రధానగ్రంథమగుటచే దానిని సులభముగా కొరుకుటకు వీలులేదు. పిల్లమనుచరిత్రవలెనె, పిల్లవసుచరిత్రలు పుట్టినవి. అయితే పిల్లలు పిల్లలే, పెద్దలు పెద్దలే! ఆంధ్రవాఙ్మయసభాభవనమున శాశ్వతస్థానమును పొందిన బట్టుమూర్తి బహుప్రశంసనీయుఁడు.

---

29. ఆంధ్రేతిహాసపరిశోధకమండలి, సం. 8-4. పుట 243.

# దృశ్యకావ్యములు

(ప్రవేశము)

డాక్టరు బి. వి. కుటుంబరాయశర్మ.

మన పూర్వ లాక్షణికులు కావ్యమును దృశ్యమనియు శ్రవ్యమనియును ద్విధాకరించి రూపకములను దృశ్యములుగఁ బరిగణించినారు. దృశ్య మనఁగా "దర్శింపఁదగినది, చూడఁదగినది, లేదా కంటికింపైనది" యని యర్థము. ఈ దృశ్యకావ్యములకు రూపకములనియు వ్యవహారము. సాహిత్యమును గావ్యనాట్య విభాగములుగ విభాగించి రూపకమును నాట్య వర్గమునఁ జేర్పుటకూడఁ గలదు. అప్పుడు దానికి నాటకమని వ్యవహారము.

సాహిత్య సోపానములలో నాటక మన్ని ప్రక్రియలకంటె పై మెట్టని భారతీయులు విశ్వసింతురు. కావుననే 'కావ్యేషు నాటకం రమ్య' మ్మనెడి లోకోక్తి. ఈ సూక్తి సాధువైనదే! ఏలన, నాటకమున లలితకళ లనేకములు సామరస్యమునొందుచు, దాని కనిర్వాచనీయమైన రామణీయకమును సమకూర్చుచున్నవి; సామాజికులకు నిశ్శ్రేయసానందము నందించు చున్నవి. ఐతిహాసిక దర్శనపథమునుండి చూచినను నాటకము సాహిత్య గుళుచ్ఛమునందు చిట్టచివర పూచిన పూజాపుష్పముగ గోచరించును. కావుననే సంస్కృత సాహిత్యములో నాటకమునకు మహోన్నతమైన స్థాన మేర్పడినది.

'నాటక' మనునది రూపకసాహిత్యశాఖయందలి యొక రెమ్మయే యైనను రూపకసాధారణ్యమునకుఁగూడ నాటక మను పేరు వచ్చెను. ముందు నృత్తము, పిదప నృత్యము, నా పిమ్మట నాట్యము ననునవి, క్రమవికాసమునొంది తుదకు 'నాటకము'గా రూపొందినట్లు బరిశీలన వలన విశద మగుచున్నది. కావున వీని వీనినిగూర్చి యించుక తెలిసికొనుట యావశ్యకము.

## నృత్త, నృత్య, నాట్యములు.

ప్రాచీన యుగములందే లాక్షణికులు నృత్త నృత్య నాట్యములకుఁగల విభేదములను విస్పష్టపఱచిరి. కొన్నిరూపకములలో నాట్యమునకును ప్రాధాన్య ముండెడిది. కావున నీ యీపదములను గూర్చి ముందుగ నించుక యెఱుఁగుట ముఖ్యము.

నృత్త 1, నృత్య, నాట్యములనెడి యీ శబ్దత్రితయి సంస్కృత రూపకములలో నధికముగ వాడఁబడెను. 'నృత్' 2 ధాతువునుండి నృత్త, నృత్యశబ్దములు నిష్పన్నము లైనవి. 'నట్' 3 ధాతువునుండి నాట్య మనుపద ముద్భవించినది.

'నట్' ధాతువే తొల్లిటిదనియు 'నృత్' దానికి సంస్కృతరూప మనియుఁగూడఁ గొందఱవాదము. నిజమునకు నృత్ ధాతువే మొదటిది. మొత్తముమీఁద 'నృత్, నట్' ధాతువులలో నేది ప్రాచీన మను విషయమునందు పండిత లోకమున భేదాభిప్రాయము 4 కలదు. ఈ యభిప్రాయభేదమునకు హేతువు లనేకములు గలవు. అందు ముఖ్యమైనది వెబర్ పండితు నంతటి మహనీయుఁడు 'నట్' అనునది 'నృత్' ధాతువునకుఁ బ్రాకృతభాషారూప మనుట. యథార్థమునకు 'నట్' ధాతువు ప్రాకృతము కాఁజాలదు. ప్రాకృతవాఙ్మయములో నట్టి రూప

---

1. "నృత్తముఁ జేసిపోవ"—శ్రీమదాంధ్ర మహాభారతము- విరాట- అ. 2 ప. 265. వావిళ్ళ- 3 సంపుటము, పుట 62. (1962).

2. "నృతీ" గాత్రవిక్షేపే=అంగవిక్షేపమాత్రముగలది నృత్తము. గురుబాల ప్రబోధిక, పుటలు 147, 148. వావిళ్ళ. (1953).

3. "నట్యతేనటనం"-ణటనృత్తౌ. నటించుట నటనము. నటస్యకర్మ నాట్యం. నటుని యొక్క వ్యాపారము. వివాహాభ్యుదయాదౌ సర్వ రస ప్రధానం నాట్యం. అనఁగా వివాహాది శుభకార్యములయందలి సర్వ రస ప్రధానమైనది నాట్యము. Id. P. P. 147, 148.

4. నాట్యశాస్త్రము. [డాక్టర్, పోణంగి శ్రీరామ అప్పారావు.] పుటలు 136-139. విశాంబి. (1959 ?)

మెచ్చుటను నగపడదు. ప్రాకృత నైఘంటికులు 'నడ' ధాతువు సంగ్రహించిరి. ప్రాకృతాగ్రమున 'నట' ధాతువునుగూర్చియే వారు చెప్పలేదు. 'నట్టఇ' వంటిరూపములుమాత్రి మున్నవి. కాని 'నట్ట' రూపమునుండి 'నట' రూపము నిష్పత్తియగుటకు వీలులేదు; 'నాట్య' రూపము నిష్పాద్య మగును.

ముందు 'నృత్' రూపము ఋగ్వేదమున నున్నది. పాణిని మహర్షి ప్రణీతమగు 'అష్టాధ్యాయి'లో దొలిసారిగ 'నట్' కాననగును. అందుచే 'నృత్' పూర్వతరమైన రూపము. ఈ రెండు ధాతువులును సంస్కృతవాఙ్మయములోనివే కాని యన్యములుమాత్రము కావు. తొలి యుగములలో 'నృత్' అనునది యొకరకమగు వినోదక్రీడను సూచించెడిది. తరువాత పోనుపోను నూతనవిశేషము లిందు చేరుటచేనా పెరిగిపోయిన వినోదమున కొకక్రొత్తపేరు కావలసివచ్చెను. దానితో 'నృత్' వలన 'నృత్యము' 1 అనునర్థమును 'నట్' వలన నభినయము అనునర్థమును వెలువడినట్లు తజ్ఞుల పలుకు.

తాను సప్తత్రింశన్నాట్యభేదములను (ముప్పదియేడు రకముల నాట్యములను) 'నాట్యసర్వస్వదీపిక' యనుగ్రంథము పేర్కొన్నది. దానిపీఠికలోని యంశములనుబట్టి నాట్యము, రూపకము ననునవి వేర్వేఱు. నాట్యమనఁగా నృత్తనృత్యము లనియే స్థూలార్థము. నాట్య విభాగములలో (౧) తాండవ (౨) నర్తన (3) లాస్యము లనువానిని తద్గ్రంథము చేర్చినది. 'మాలవికాగ్నిమిత్రనాటకము'[2] నాట్యశబ్దము ను నృత్తనృత్యపరముగనే ప్రయోగించెను.

---

1. నాట్యశాస్త్రము. [డాక్టర్, పోణంగి శ్రీరామ అప్పారావు.] పుట 20. విశంబి. (1959 ?)

2. కాళిదాసుని రైయి దంకముల నాటకము.

'ఛలితము'[3] (చలితము) అనునది యొక యపరిణత నాట్యవిశే
షము. ఈఛలితమును 'మాలవికాగ్నిమిత్త్రము'లో నాయికయగు మాలవిక చక్కఁగనభినయించినది. దానిప్రకారముగ నాలోచించినచో 'ఛలితము' నృత్యమని తోఁచును. అది రూపకముగాదు; కేవలము నృత్తప్రకారముగూడఁగాదు. ఆనాయిక పఠించిన శ్లోకముతరువాత "యథారస మభినయతి" యని సూచన మున్నది. అందుచే మాలవిక చేసినది యభినయముతోఁగూడిన ప్రదర్శన మనుట నిర్వివాదము. నృత్యము[1]నకుఁగల పారిభాషికలక్షణ మిదియే!

ఇచ్చట బి. కె. ఠాకూర్ మహోదయుని యభిప్రాయము గమనార్హము. 'పంచాంగాభినయనము'నకును 'ఛలితము'నకును కాళిదాస మహాకవి మతములో భేదము కలదు. అతఁడు సూచించిన భేదమును బట్టి 'పంచాంగాభినయ' మనఁగా, నటుఁడు సుశిక్షితుఁడైన పిమ్మట సంపూర్ణ సామగ్రితో రంగముమీఁద నభినయించుట. ఛలితమునందు సామర్థ్య మలవడిన యనంతరముగాని పంచాంగాభినయము నేర్పరు. చలితములో దొలుత నర్తకి నృత్యసంగీతములు ప్రదర్శించును; ఆపిమ్మట నృత్యసంగీతములు లేకయే, యభినయింపఁగలదు. మఱియు ఛలితమునఁ బ్రదర్శింపఁదగు గ్రంథముకూడఁ బరిమితముగ నుండును. అయ్యావిధరసములును, ఘట్టమునకు సహజమైన యవస్థావిశేషములును నందిమిడియుండఁగలవు. నృత్యసంగీతములుగల పూర్వార్థప్రదర్శనము ముగియఁగనే యభినయముగల యుత్తరార్థము (అనఁగా, నాట్యము) బ్రదర్శింపఁబడును. ఆచార్యుఁడేని, ప్రాశ్నికుఁడేని, జరిగినగ్రంథమును

3. ఛలితక్ = నాటక్ కా ఏక్ భేద్. నాలందావిశాలశబ్దసాగర్- పుట 400- విక్రమ 2007.

1. కాళిదాస మహాకవి నృత్త నృత్య నాట్యములను కలఁగపులగము చేసెను. చూడుడు- నాట్యశాస్త్రము- [డాక్టర్, పోణంగి శ్రీరామఅప్పారావు] పుట 138- పంక్తులు- 32, 34. విశంబి. (1959 ?)

గుఱించి ప్రశ్నించుట యిందొక విశేషము. ఆయీకారణములచే ఫలితము బహిరంగప్రదర్శనముగాక సాధనదశలోని పాఠశాలాప్రదర్శనము వంటిది.

ప్రకృతమునకు నృత్త నృత్య నాట్యాములనుగూర్చి[2] యీదిగువఁ గలరీతిని సంగ్రహపఱచిన చాలును:—

(1) నృత్తము నందు కేవలము నవయవచాలనమే యుండఁగలదు. అనఁగా, నేత్ర భ్రూ ముఖ హస్త భుజ వక్షోజ కటి పాదాంగుళుల చాలనము.

(2) గానము, పాఠ్యము, వ్యక్తీకరణము ననునవి నృత్తమునకుఁ దోడైనచో, నది నృత్యమగును.

(3) నృత్త నృత్యములకు రూపకాభినయముకూడ తోడైనచో, నది నాట్యాభినయము కాఁగలదు. అవశ్యకములుగాని,చో నృత్య సంగీతములను నటుఁడు విడువవచ్చును.

(4) స్త్రీలకు లాస్యమును బురుషులకుఁ దాండవమును విధింపఁబడినవి.

(5) నృత్యము భావాశ్రయము. నాట్యము రసాశ్రయము.[1]

ఇందుచే నాట్య మనఁగా, సంగీత సాహిత్యాభినయములతోఁ గూడిన "ఆట" యని తేలినది. దీనినిబట్టి నాటకమునఁ గావ్య నృత్య గీతాదులును జేరియున్నవని చెప్పనొప్పును. నాటకమును బ్రయోగించుటకుఁ జిత్ర శిల్పాది లలితకళలతోడ్పా టావశ్యకమై యుండవలెను.

2. వీనినిగూర్చి యనేకభిన్నాభిప్రాయములు గలవని మున్నే చెప్పఁబడినది.

1. నాట్యమువలె, నృత్తనృత్యములు రెండును రసాశ్రయములే యను వాదము కూడఁ గలదు. శ్రీ కె. యమ్. వర్మగారి "నాట్య-నృత్త-నృత్యములు" అను గ్రంథము- [పుటలు 44, 45, 70, 71.]- ఇట్టి వాదములకు మూలము. "భావప్రకాశము" యొక్క యొకవ్రాఁతప్రతిలోను పాఠాంతరము. [నాట్యశాస్త్రము- పుట- 135.]

ఈరీతిగ నాటకము లలితకళలకు నిలయమై యపూర్వరామణీయక ముతోఁగూడి వివిధాభిరుచులుగల మహాజనమున కానందదాయక మైనది.

బహుస్థూలముగ నిచ్చట రూపక నాటకములు పర్యాయము లుగఁజెప్పఁబడినవి. నాట్యము దృశ్యమాన మగుటచే 'రూప' మనఁ బడును. ఆ రూపముయొక్క యారోపము కలదగుటవలన నది రూపక మగుచున్నది. కావున మానవ నిసర్గ మగు భావప్రకటనేచ్ఛయు ననుకరణశీలమును రూపక (నాటక) సృష్టికి మూలకారణము. ఆ యనుకరణమునకు సంభాషణములుగూడఁ దోడైనచో, నపు డది సార్థక నామముగల నాటక మగుచున్నది.

'నాట్యము', నృత్యమునకుఁ బరిణతరూపము. నృత్యము, నృత్తమునకు వికాసరూపము. కావున నీ యన్నిటియందును చిందులును ఆ చిందులకుఁ దగిన సంగీతము నుండును. కాని, నృత్తమునకు సంగీత మావశ్యకము గాదు. నృత్యములో 'పై పాటకులు' వాద్యములతోఁ బాట పాడుచుండ నర్తకుఁ డాపాట నుచ్చరించుచున్న ట్లగపడుచు నందలి భావము నభినయించును.

దృశ్యకావ్యారంభదశలో నృత్యసంగీతములకుఁ బ్రాధాన్య ముండెడిది. దృశ్యమునకుగల పర్యాయపదములలో 'సంగీతక' మొకటి యగుట యీ వాదమునకుఁ జమురుపోయఁగలదు. పై యంశము లీ క్రింది పరిచ్ఛేదములలో నించుక వివరింపఁబడగలవు.

నాట్యమునఁగూడ పాటను పై పాఠకులే పాడి నటున కభినయము మాత్రము వదలిపెట్టునట్టి విధానము నేఁటికిని మళయాళదేశమునఁ గల 'కథకళి' యను మూకనాట్యవిశేషమునఁ గనఁబడుచున్నది. బయలు (బహిరంగ) నాటకములలో నటుఁడు పాట పాడఁడు; పై పాటకులే పాడెదరు. అతఁ డెగురుచు నాంగికాభినయము చేయును. వాంఛ

కాభినయము చేయవలసివచ్చినప్పు డెగురుటమాని, కొద్దిపాటి యాంగి కాభినయముతో వాచకమును నిర్వహించును. ఈ రీతిగ నాట్యము నందు గద్యము ప్రవేశించి దినదినాభివృద్ధినొంది సంవాదమును గథను గూడ వృద్ధిపరచినది.

ఆ పిమ్మట రానురాను నృత్యసంగీతములు నాట్యములో క్షీణించినవి. ఎట్టకేలకు నేఁటిగీర్వాణసాహిత్యమున గోచరమగు నాటకము లన్నియు గద్యపద్యాత్మకము (చంపువు) లై యుండుటకుఁ బైకారణములు తోడ్పడె ననవచ్చును.

తొలుదొలుత నీనృత్త నృత్య నాట్యములను దేవతలయెదుట గంధర్వులు నప్సరసలును బ్రదర్శించెడివారఁట! మహేశ్వరుఁడు తాండవ లాస్యములను రెండు విధానముల నిందు జేర్చియుండెను. ఈ తాండవ లాస్యములు నృత్తవిశేషములే యగుచున్నవి. 'తండువు' మహేశ్వరుని యనుచరుఁడు. ఇతనికి 'తుండి, నందికేశ్వరుఁ' డనియు నామాంతరములు. శివద్వారపాలకులయం దొకఁడగు నీ తండులే నాట్యశాస్త్రకర్తయగు భరతర్షికి నృత్తవిద్య కఱపిన గురు వందురు. "తండు" ప్రోక్తమగుటవలననే నృత్యమునకుఁ దాండవమని పేరువచ్చినది.[1] పరమేశ్వరున కనుచరుఁడై యీ కళలో శిష్యుఁడైన తండువు పేరనే తాండవము ప్రసిద్ధిగాంచెను. ఇది పుంనృత్యము (పుం నృత్యం తాండవం ప్రోక్తం స్త్రీనృత్యం లాస్య ముచ్యతే.)

తమ భక్తుఁడగు బాణాసురుని పుత్రికయైన యుషాకుమారికిఁ బార్వతీదేవి లాస్యము నేర్పినది. ఆ యుషాకుమారి తన వివాహానంతరము ద్వారకానగరమున నివశించుచు నచ్చటి గోపికలకు లాస్యము నేర్పెను. గోపికలవలన సౌరాష్ట్రదేశ స్త్రీలును వారినుండి యితరు

1. "వాచస్పత్యనిఘంటువు", తారానాథతర్క వాచస్పతిది; "కల్పద్రుమ నిఘంటువు", సర్ రాజా రాధాకాంతదేవ బహదరు; "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు"-తృతీయసంపుటము. (1942)

లును నీ లాస్యకళ నభ్యసించిరి. ఇఁక నృత్యవిషయము. ఇందు వాచిక ముండదు; కేవల మభినయ మే యుండును. పోఁగా, నాట్యము. నాట్యమన నాటక మే ! ఇం దభినయ వాచకములు రెండు నుండును. సుఖ దుఃఖ సమ్మిశ్రితమగు లోకస్వభావాభినయ మే నాట్యము.

గానము, నభినయము, సంభాషణము, రూపారోపము ననునవి సంస్కృతరూపకములలో బూర్వకాలమునుండియుఁ గలవు, భారత భూమిలో గానము వేదకాలము నుండియుఁ గలదు. వే ద ము ల లో గాన మున్నది. వానిలో సంవాదములును గలవు. ఋగ్వేదమునందు పదుమూఁడు సంవాదములు విస్పష్టముగ గోచరించును. సూతునకు నతని శిష్యులగు వైశంపాయనాదులకును జరిగిన సంవాదరూపమున వెలసిన దే సంస్కృతమహాభారతము. ఉపనిషత్తులయందు వాకోవాక్యము లనఁబడు సంవాదములు (సంభాషణలు) పెక్కు లున్నవి.

ఋగ్వేదమునఁ గొన్ని సంవాద సూక్తములు గలవు. "యమ యమీ సంవాదము", "ఊర్వశీ పురూరవ సంవాదము" మున్నైనఁ వెందులకుఁ బ్రసిద్ధోదాహరణములు. ఋత్విజు లాయా దేవతలయు ఋషులయు స్థానములలో నిలిచి రంగముపై నటులు సంవాదమును నిర్వహించునట్లు, పై సూక్తులను జెప్పుచుండెడివారు.

యజుర్వేదములో నానావృత్తుల నవలంబించిన జనుల ప్రసక్తి యున్నది. ఆ సందర్భములో 'శైలూష'పదము ప్రయోగింపబడెను. శైలూషి యనఁగా నటకుఁడు.

పురాణేతిహాసములయందుగూడ నాటకము పేరు గలదు. మహాభారతమున 'నట' శబ్ద మున్నది. హరివంశములో నటులు రామాయణకథను బ్రదర్శించునట్లు చెప్పఁబడెను. రామాయణమునందును 'నట, నాటక' పదములు ప్రసక్తింపఁబడినవి.

పురాణములు, నాటకోత్పత్తికిని దాని యభ్యుదయమునకును చాల సాహాయ్యకారులై యుండి యుండవలెను. పౌరాణికులు పురాతనకాలమునుండియుఁ బురాణములను జెప్పుచున్నట్లు ప్రమాణములున్నవి. పాఠకులు సర్వసాధారణముగ వానిని రాగధోరణిలో జదువుచుండిరి. 'ధారకులు' వానిని వివరించి చెప్పెడివారు. కథకు లభినయనృత్య గీత వాద్యములతో వానిని రసమయ మొనర్చుచుండిరి. నటులకు 'భాగవతులు' అను వ్యవహృతి నేఁటిది కాదు. 'భాగోతుల బుచ్చిగాఁడు' తెలుఁగు ప్రబంధ పాఠకులకు శ్రుతపూర్వుఁడే. నాటక పురాణ కావ్యాదులకుఁగల కనిష్ఠసంబంధ మనాదికాలమునుండి వచ్చుచున్న యాచారము. నేఁటికిని జంత్రిగాత్రములయందు చెప్పఁబడెడి పురాణహరికీర్తనాదిరీతులు కొన్ని నాటకముల కాదిరూపములు గావచ్చుననెడి వాదములు కలవు.



శ్రీమ జ్జగద్గురవే నమః

# మేలుకొలుపు

— శ్రీమతి దేవరకొండ నీలమణి.

ఉ. తెమ్మదెగో వినంబడుటలేదె భవద్వరభక్తసంస్తుతుల్
కమ్మనిపిల్లగాలులు సుఖంకరరీతుల వీచి లోకమాం
ద్యమ్ము హరించె పద్మవనితాంగపరిమళముల్ త్వదీయసే
వ్యమ్మును గోరిహెచ్చె; కమలాకరపంకజమున్ గ్రహింపుమా! 1

ఉ. లెమ్ము రమామనోహర ! ఫలింపగ జ్ఞానుల సుప్రభాతగీ
తమ్ములు; వేదవంద్యమగు త్వచ్చరణాంబురుహద్వయిన్ ప్రశ
స్తమ్మగు నందనాచ్ఛసుమసంపద గొల్తుము; భాస్కరాంశువుల్
తమ్ముల నిద్రమేల్కొలిపె; తాల్యము వీడు సుషిప్తిపై వెసన్. 2

ఉ. లెమ్ము వృషాద్రివాస ! పవళించుటచాలు దివాకరుండు ర
థ్యమ్ములు పూన్చి నాకసమునందు విహారముజేయ నెంచి; త
ల్పమ్మును డిగ్గి భక్తజనపాళికృపాభరణుండవై ప్రమో
దమ్మున దేల్పు మాశ్రితవితానము నిత్యము నిస్పృజించుతన్. 3

ఉ. లెమ్మిక వేంకటేశ్వర ! నిలింపులు బారులుతీర్చినారు నై
జమ్మగు భక్తిభావవివశత్వము పైకొన; లేచి కాల్యకృ
త్యమ్ములు నిర్వహింపుము; బుధస్తవనీయ మనోజ్ఞమూర్తివై
యిమ్ము సుదర్శనమ్ము తరియింతురు తావకరూపదీధితిన్. 4

ఉ. లెమ్ము పరాత్పరా ! భవదలేఖ్య మహోజ్జ్వలలీల లెల్ల గా
వ్యమ్ముల భక్తిసంభరితులై రచియించి కవిప్రతిష్ఠ నం
దమ్ముగబొంది రార్యులు; మనమ్మున తీయనియోచనార్హుల్
క్రమ్మ నదంభమౌ ఫణితి వ్రాయదలంచితి వ్రాసి తీగతిన్. 5

## శ్రీనాథయుగపు

## సాహిత్య పరిశీలన

—శ్రీ రేవూరు అనంతపద్మనాభరావు, ఎం., ఏ.

ఆంధ్ర వాఙ్మయచరిత్రకారులు పదియుగములుగ చరిత్రను విభజించిరి. శ్రీనాథయుగము క్రీ. శ. 1350 తో ప్రారంభమై, 1500 ప్రాంతమున అంత మగును. శ్రీనాథుని యుగకర్తనుగా కొందఱు భావింపగా, మరికొందఱు ఆకాలమును సంధియుగ మనుట సమంజస మని వాదింతురు. కాని, కవిసార్వభౌముడుగ తెనుగుసారస్వతమున వెలుగొందినకారణముచేతను, తరువాతికవులపై శ్రీనాథునిప్రభావము గణనీయ మైనది అగుటచేతను శ్రీనాథునే యుగకర్తనుగా పేర్కొనుట భావ్యము. ఆంగ్లవాఙ్మయచరిత్రలో నొకయుగమునకు మరియొకయుగమునకు మధ్య గలకాలమును సంధియుగ మందురు. అట్టిలక్షణములు ఈయుగమునం గానరావు. ఈయుగమున సాహిత్యప్రసారము రెడ్డిరాజులప్రాపునను, ఆపిదప విజయనగరసామ్రాజ్యపరిపాలకులఅండనునిలచినది. కావున దీనిని సంధియుగ మనుటయుం బొసంగదు !

విశిష్ట ప్రక్రియలు :—

ఈయుగమున రచనాప్రక్రియావైవిధ్యము గానుపించును. శృంగారనైషధాదిసంస్కృతకావ్యానువాదములు, శృంగారశాకుంతలము, ప్రబోధచంద్రోదయము మొదలుగాగల సంస్కృతనాటకానువాదములును, మరుత్తరాట్చరిత్ర, విక్రమార్కచరిత్ర మొదలుగా గల కథాకావ్యములును, పల్నాటివీరచరిత్ర,హరిశ్చంద్రోపాఖ్యానము వంటి ద్విపదరచనలును వెలసినవి. సంకలనగ్రంథములు ఈ యుగముననే సకలనీతిసమ్మతము గాథాసప్తశతి అనుపేర వెలసినవి. ఈ విధముగా విశిష్టప్రక్రియలతో సాహిత్యరమ ఈ యుగమున శోభిల్లినది.

యుగవైశిష్ట్యము :—

ఈ యుగమున కవిచంద్రుల దృష్టియు ప్రజాధోరణియు పురాణములనుండి ప్రబంధములవంకకు మరలి ప్రబంధరచనకు దోహదము లభించినది. భీమఖండాదిపురాణములు అనువదింపబడినను, అవి శబ్దాలంకారవైశిష్ట్యముచేతను, వర్ణనోజ్జ్వలతచేతను ప్రబంధమార్గమును అవలంబించినవి. ఈ యుగమున వెలసినకవులు మతగ్రంథములను ఆధ్యాత్మిక గ్రంథములను, లక్షణగ్రంథములను, స్వతంత్రకావ్యములను రచించి, సాహిత్యమునకు సేవ యొనర్చిరి.

స్వతంత్రకావ్యనిర్మాణము :—

శ్రీనాథుడు నైషధాదికృతులను అనువదించినను, ప్రతిభాపాండిత్యములు గల్గిన కవి యగుటచే హరవిలాస మను స్వతంత్రకావ్యమునుగూడ రచించెను. దీనికి, ప్రత్యేకముగ సంస్కృతమున మూలగ్రంథ మేదియును గానరాదు. అచ్చటచ్చట తన సంచారములో విని శివభక్తులకథలను ఇందు పొందుపరచెను. ఇక, దేశికవితామార్గమున దేశీయేతి వృత్తముతో ద్విపదప్రబంముగ పల్నాటివీర చరిత్ర వెలయుట గమనార్హము.

జంటకవులు :—

నందిమల్లయ, గంటసింగయ అను నిరువురు జంటకవులు ఈ యుగమున రచనలు చేసినారు. ఆంధ్రవాఙ్మయమున ప్రప్రథములుగ వెలసినజంటకవులు వీరే. వీ రిరువురును పండ్రెండు ఆశ్వాసములు గల్గిన వరాహపురాణ మను అనువాదకావ్యమును, ప్రబోధచంద్రోదయ మను ప్రబంధమును వ్రాసిరి. ఈ ప్రబోధచంద్రోదయమును సంస్కృతమున కృష్ణమిశ్రుడు నాటకముగా రచింపగా, వీరు దానిని ప్రబంధముగ ననువదించి, నూత్నమార్గమును చూపిరి. ఇది యిట్టి రచనలలో ప్రథమము. పిల్లలమఱ్ఱి పినవీరన కవి కుల గురు డగు శాళీ

దాసుని అభిజ్ఞాన శాకుంతలమును ప్రబంధముగ శృంగారశాకున్తల మను పేర రచించినను, అది మూలమునకు సంపూర్ణానువాదము కాక పోవుటచే ప్రబోధచంద్రోదయమే ప్రథమ మయినది. ఈ గ్రంథము వేదాంత గ్రంథముగూడ నగుటచే మిక్కిలి విశిష్టమైనది. కాని, సంస్కృతమున ఉన్ననాటకములను గూడ వీరు ప్రబంధములుగానే రచించుటచే, ఆనాటికి తెనుగు నాటకరంగస్థలము ప్రసిద్ధమయి యుండ దని భావింపవచ్చును.

క్షేత్రమాహాత్మ్యములు:—

ఈయుగమున కాశీఖండము, భీమఖండము, వేంకటేశ్వర మహాత్మ్యము, కాంచీపురమాహాత్మ్యము, శ్రీరంగ మాహాత్మ్యము మున్నగు క్షేత్రమాహాత్మ్యములను ప్రకటించు గ్రంథములు వెలువడినవి. అందు, కాశీఖండభీమఖండములను శ్రీనాథుడే రచించెను. "కాశీఖండం అయఃపిండం" అను సంస్కృతసూక్తిని నిరూపించు విధముగాగాక శ్రీనాథుని కాశీఖండము సజీవ మగు పాత్రచిత్రణముతో విలసిల్లు చున్నది. అందు గుణనిధి, నిగమశర్మలు తెనుగుసాహిత్యాకాశమున ధ్రువతారలై, వెలుగొందుచున్నారు. నృసింహపురాణము గూడ నిట్టి గ్రంథమే యయినను, ఈ యుగమున క్షేత్రమాహాత్మ్యములకు లభించినప్రశస్తి దాని కంతగా లభింపలేదు.

లక్షణగ్రంథములు :—

రసాభరణము అనంతుని ఛందము, గౌరనలక్షణ దీపికమున్నగు లక్షణగ్రంథములు ఈ యుగపు ప్రాచుర్యమును ఇనుమడింపజేయు చున్నవి. అనంతామాత్యుడు అలంకార లక్షణములను దెలుపుచు రసాభరణమును, ఛందోలక్షణములను తెలుపుఛందోదర్పణమును గూర్చెను. ఇట్టి ప్రక్రియ యీయుగముననే ప్రశస్తమైనది. లక్షణశాస్త్ర గ్రంథములను రచించునలవాటు ఈకాలముననే ప్రారంభమైనది. ఇది తెలుగుసాహిత్యవ్యాప్తికి మిక్కిలి దోహదకారి యయినది.

తొలి తెలుగు రచయిత్రిగా వెలసిన తిమ్మక్క ఈ యుగమునకు సంబంధించిన దే. ఈమె సుభద్రాపరిణయ మను కావ్యమును ద్విపదలలో రచించెను. సాహిత్యరచనకు స్త్రీలుగూడ కలము బట్టుట ఈయుగమునసే తిమ్మక్కతో ప్రారంభమగుట విశేషము!

నవీనత :—

ఈ యుగమున కవులదృక్పథము పురాణములవైపు ఎక్కుడుగా మరలలేదు. ప్రబంధధోరణిలో కావ్యములను రచించుటకే శ్రీనాథాదికవులు ఉపక్రమించిరి. అట్లని, పురాణములను పూర్తిగా నిరసింప లేదు. పెక్కుపురాణములును పరిఢవిల్లినవి. సహజకవితాపాండిత్యములచే విలసిల్లినపోతనార్యుడు ఆంధ్రమహాభాగవతమును రసజ్ఞముగం గూర్చినాడు. జైమినీభారతము, పద్మపురాణము, వరాహపురాణము, వాసిష్ఠరామాయణము నీయుగమున వెలసిన పురాణములే! కాని, ఈ యుగమున వెలసినకావ్యజాలమున వర్ణన లతిశయములై, ప్రబంధ రచనకు పెద్దనాదులు స్వతంత్రప్రబంధములను గూర్చుటకు ఈయుగము కొంత దోహదకారి యయినది.

మతగ్రంథములు:-

ఆంధ్రసారస్వతము మతపరిస్థితులకు అనుకూలముగ కొనసాగుచువచ్చినది. అసలు ఏ సారస్వతమైనను కాలపరిస్థితుల ప్రాబల్యమును పొందక తప్పదుకదా! ఆదికవి యగు నన్నయ వైదికమతోద్ధరణకు వ్యాసభారతము ననువదించెను. శివకవులు వీరశైవావేశముతో శైవ మతప్రచారమునకై బసవపురాణాదిగ్రంథములను వ్రాసిరి. తిక్కన శివకేశవుల కభేదమును చాటిచెప్పుటకును, హరిహరనాథతత్వమును ప్రచారమొనర్చుటకును భారతమును తెనిగించెను. శ్రీనాథయుగమున ఏమతమునకును అంతప్రాబల్యము కన్పింపదు. శైవమతగ్రంథములును, వైష్ణవమతగ్రంథములు నీయుగమున విరచింపబడెను. బసవపురాణ చంపూకావ్యము, శివరాత్రి మాహాత్మ్యము, ప్రభులింగలీలలు మున్నగు శైవమతగ్రంథములును, వరాహపురాణము, అన్నమాచార్యసంకీర్తనలు, భాగవతము మున్నగు వైష్ణవ మతగ్రంథ

ములును ఈ యుగముననే యుద్భవించినవి. శ్రీనాథునిగ్రంథములలో శైవమతసంబంధము లగు హరవిలాసము, కాశీఖండము శివరాత్రి మాహాత్మ్యము పైకోవకుచెందినవే.

ద్విపదవాఙ్మయము:—

దేశీయేతివృత్తములో, దేశీయచ్ఛందస్సులో తొలి తెలుగు ద్విపదకావ్యమును వెలయించిన పాల్కురికి సోమనాథుడు ఈ వాఙ్మయమున నాదికవి. ఇతనిప్రభావము శ్రీనాథయుగమున విరివిగ నగుపించును. ద్విపదభాగవతము, నవనాథచరిత, గౌరనహరిశ్చంద్రోపాఖ్యానము, తిమ్మక్క సుభద్రాపరిణయము పల్నాటివీరచరిత్రయు ద్విపదవాఙ్మయమున ప్రకాశించుచున్నవి. వీరగాథలకు ఉనికిపట్టయి, తెనుగుదేశవుజానపదజీవనమునకు ప్రతిబింబమై, పల్నాటివీరగాథ దేశీయచ్ఛందస్సులో రచింపబడుట గణనీయము. ఈ యుగమున ద్విపదవాఙ్మయము వెల్లివిరసి, తరువాతియుగములలో గూడ సకృత్తుగాఁ గానవచ్చును. ఈ విధముగ వాఙ్మయతరువున నీశాఖయీ యుగమున శోభిల్లినది.

వేదాంతగ్రంథములు:—

ప్రబోధచంద్రోదయమును జంటకవులు అధ్యాత్మికదృష్టితో రచించిరి. పిదప నాచికేతోపాఖ్యానము, శివలీలావిలాసము శివరాత్రి మాహాత్మ్యము, వేదాంతపరములైనగ్రంథములుగ తెనుగున వెలసినవి. శ్రీనాథుడు తనగ్రంథములలో గూడ నట నట వేదాంతవిషయములను ప్రతిపాదించెను.

శృంగారపరత్వము:—

శ్రీనాథునియుగమున సాహిత్యలక్ష్మికి అండదండలు బాగుగ లభించినవి. దేశము సుభిక్షమై ప్రజలు కొంతవరకు శృంగారమువైపు మొగ్గుజూపిరి. కవులును వారి ననుసరించి, శృంగారప్రధానము లయిన కావ్యములనే రచింపఁదొడగిరి. సంస్కృతశ్రీహర్ష నైషధమును శ్రీనాథుడు శృంగారనైషధ మనుపేర తెనుగున ననువదించినాడు.

వీథినాటక మైనక్రీడాభిరామము రసికజనమనోరంజకముగ నున్నది. పోతనవంటివిష్ణుభక్తుడును రావుసింగభూపాలుని వేశ్యపై భోగినీదండకమును రచించెను. కాళిదాసుని అభిజ్ఞానశాకుంతలమును గూడ "వాణిని తనరాణిని చేసికొనిన" పినవీరభద్రుడు శృంగారశాకుంతలమను పేర రచించెను. అయినను, ఈ యుగమున శృంగారపరత్వము బీజప్రాయముగ మాత్రమే ఆరంభమై, తరువాతియుగములలో ఫలపుష్పభరితమై అలరారినది.

విశేషములు:—

కవులసంఖ్యలోగూడ బాహుళ్యము గాన్పించుచున్నది. కావ్యముల నంకితముంగొనుటకు రాజులు నుబలాటపడుచుండిరి. కవిత్వమున ప్రౌఢశైలి పరిఢవిల్లినది. నరాంకితముగ గ్రంథమును రచించుటకు విరుద్ధముగ పోతన తనభాగవతమును శ్రీరాముని కంకితమొనర్చి యొక నూత్నమార్గమునకు మార్గదర్శకుడాయెను. ఈ యుగము ప్రాచీనపురాణ కవితారీతికిని, తరువాతిప్రబంధికరచనావిధానమునకు సేతువుగా నిలచినది. మైరావణచరిత్ర, ధనాభిరామము, సస్యానందము మున్నగు అమూలకగ్రంథములును రచింపబడినవి. సంస్కృతానువాదపద్ధతియందుగూడఁ గొంతస్వాతంత్ర్యము లభించినది. శబ్దాలంకార ప్రాచుర్యత, వర్ణనోజ్వలత కవితాకన్యకు వన్నియలనుఁ జేకూర్చినది.

పైపరిశీలన గాంచినచో, శ్రీనాధయుగము ప్రక్రియావైవిధ్యమునందును, కవితాపాటవమునందును విశిష్టతను పొందినది. కవిసార్వభౌము డగుశ్రీనాథునిప్రభావము తరువాతికవులపై ప్రచురముగానుండుటచే మహామనీషి యగుపోతనార్యుని పేరఁగాక శ్రీనాథుని పేరనే యీ యుగమును వెలయించుట సంభావ్యము. రెడ్డిరాజుల ఆదరణ ఈ యుగమున మిక్కుటముగ నున్నను సాహిత్యచరిత్రయందు గూడ వారిపేరనే యుగములను వెలయించుట సముచితము గాకుండుటచే, ఆయుగమునఁ బ్రతిభాపాండిత్యప్రకర్ష చేఁ బ్రకాశించిన శ్రీనాథునే యుగకర్తను గావించుట భావ్యము.



## గ్రాంథిక భాష పరిత్యాజ్యమా ?

శ్రీ రాళ్లపల్లి సుందరం.

ప్రపంచమున సమస్యలతో సతమతమగు నీకాలమున భాషను గూర్చిన వాదములను గుఱించి వ్రాయుట యత్యాధునికులకు మనః క్లేశదాయక మైనను, వ్యాకరణాదినియమముల విసర్జించి విశృంఖల విహారము సల్పుట భాష కంతమంచిది కా దని మఱల వచించుటకుఁ గొంత సాహసించెదను. గిడుగు రామమూర్తిగారును,వారియనునాయి లును బ్రతిపాదించిన వ్యావహారిక భాషావాదము మనభాష కే కాక ప్రపంచభాషలన్నిఁటికిని స్వాభావిక మనుటయంతసమంజసము కాదని రచించుటయే యీ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము.

వ్యావహారిక భాషావాదుల వచనములను సంక్షిప్తముగ నాంధ్ర భాషావికాసకారు లిట్లు చెప్పియున్నారు. ౧. గ్రాంథికభాష చచ్చిన భాష. ౨. అం దెవ్వరువ్రాసినను తప్పు లుండకమానవు. ౩. అది పండి తులకే తెలియదు. ౪. వ్యావహారిక భాష జీవభాష. ౫. అది సుబోధక ముగ నుండును. ౬. ఎల్లఱకును దెలిసినది. ౭. పండితులు గ్రాంథికమను నది కృతకము.

వీనిలోగ్రాంథిక భాష చచ్చినభాష యని వ్యావహారిక భాష జీవద్భాష యని వచించుట మిక్కిలి యసమంజసము. తెలుఁగు భాష యం దేమాత్రముగౌరవ మున్నను మనకవులు వ్రాసిన కావ్యభాషను మృతభాష యనుటకు సాహసింపరు. చచ్చినభాష యనునది 'Dead language' అనుదాని కనువాదము. వ్యవహారమున లేని సంస్కృతము లాటిను మొదలయినభాషలను గొంద ఱట్లందురు గాని, నిత్యము మనము మాట్లాడుచున్న భాషను మృతభాష యనుట బ్రతికియున్న వానికి జీవసమాధి చేయుట. నన్నయకాలమునుండి గ్రంథస్థ మైన తెలుఁగుభాష నే మృతభాష యనిన క్రీస్తుశకారంభమునకే గ్రంథస్థ మైనతమిళ భాష నేమనవలయును? గయప్రయాగలలో విసర్జించిన భాష యనవలయును.కాని తమిళు లట్లనుకొనుట మహాపాపముగా నెంతురు

వారికి సమకాలీనసాహిత్యము కంటెప్రాచీనగ్రంథములపై గౌరవము హెచ్చు. తొల్‌కాప్పియరు తిరువళ్ళువరు కంబరు మొదలయిన గ్రంథకర్తలను దైవసమానులుగ నెంచుట వారిపద్ధతి. ప్రాచీనప్రబంధముల నన్నింటిని పెంటకుప్పపై వేయవలయు ననుట మనపద్ధతి.

బాలకవిశరణ్యకర్తలు మన తెలుగువారి దేశభాష ఒక్కొక్క జాతిలో ఒక్కొక్క మండలములో, ఒక్కొక్క విశేషము కలిగి ఉన్నను మొత్తముమీద అందరికీ సామాన్యమని అంగీకరించక తప్పదు. ఏప్రదేశమందున్నవారు ఆప్రదేశమందున్న శిష్టభాషలో గ్రంథములు రచించిన అక్కడివారికే కాక తక్కినప్రదేశములందున్నవారికికూడా మొత్తముమీద సుబోధముగానే ఉంటవి. కవులసంప్రదాయము అన్నిదేశములలోనూ ఇదే, యని వచించినారు. అన్నిదేశములలోను సంప్రదాయ మిదే యని వారు వచించుట సాహస మనుకొందును. దానినిగూర్చి వ్యాసాంతమున చర్చింతును.

శిష్టవ్యవహారమున గ్రంథములు రచింపవలయు ననుట వీరి వాదమున ముఖ్యమైనది. నిజమునకు శిష్టవ్యవహార మేదియని ప్రశ్నించినచో నాంగ్లములో గూడిన తెలుగుభాష యనవలెను. మఱిశిష్టులు మాటలాడుభాషలో చాలవఱకు నాంగ్లమే యుండును. అదియే నేటి శిష్టభాష. ఒకవేళ తెలుఁగుననే మాటలాడినను నది యాయా మండలములలో వేఱుగానుండు ననుట యెల్ల రెఱింగినదే. ఎంతశిష్టులైనను మదరాసువారిని మాటలాడించిన 'అవునప్పా! అట్లదా ఉణ్ణు మాభాష' యందురు. ఇందొకమండలమున 'నేను వస్తం పోతం నీ కిష్టం లే దేంటి' యని భాషించుట అవనగును. ఇట్లుండు వ్యవహారభాషను తమయిచ్చవచ్చినయట్లుపయోగించినపుడు భాషకొకనియమము లేక పలుచబడి పోవుచున్నది.

వ్యవహారమునందలిభాష నుపయోగించిన కవుల కుదాహరణముగ వ్యావహారికవాదులు దక్షిణాంధ్రవాఙ్మయమును జూపించుట కలదు. ఆకాలమున వెలువడిన గ్రంథములలో పెక్కుచోట్ల పాత్రోచితమైనభాషను చొప్పించుట కానవగును. 'స్వామి పరాక్కు, అందప్పడిక్కి నెల్లుం అళివామల్ పొన్నుం శలిత్తామల్ మణియగారక కోవిలప్పత్తరంనడప్పిలియ్యామల్ అల్లాం బాత్తుకొళ్ళురోమెన్ను నెల్లల్లాంపరంబాశాచ్చాన్ కోవిళుక్కుశిరిప్పుకట్టళియు,అరమనెయిలెదిన మొన్నుకులంబెదు పొన్నుక్కుడుక్కురాప్పోలెయాచ్చిధు' మన్నారు. దాసవిలాసనాటకమున రంగాజమ్మ వ్రాసిన వాక్యము లవి తెలుఁగు నాటకమందలి యీపదము లాంధ్రుల కెంతవఱ కర్థమనునో తెలియుచున్నవికదా! ఇది తమిళ మని తప్పించుకొనవచ్చును. కాని యీనాటి శిష్టులు మాటాడుభాషను రంగాజమ్మ యెట్లువ్రాసెనో చూడుఁడు.

'అలికారిమాట-స్వామి పీరు యిప్పుడు విన్నపంచేసినందులో వొంటి రూక నామీంద మోపాది అయితె వొకరూకకు పదిరూక లిచ్చేను' మంచనభట్టు-భైరవజోస్యులు నేరని మాటలె ఆడుదువు. చక్కంగా అశ్వినిభరణికృత్తికలు గురు లెరుంగవు నీకు పంచాంగం విప్పేదిన్ని నీభవిష్యికి' ఆకాలమున వ్యావహారికాంధ్రమునవ్రాసినంత మాత్రమున పాఠకులకు సుబోధ మైనదని చెప్పుట యెంతవఱకు సమంజసమో సహృదయు లెఱుంగుదురు.

ఇక గ్రాంథికభాషను నిరసించుటకు వారు చెప్పుకారణములలో దానిస్వరూప మిదమిత్థ మని నిర్ణయించుటకు వలనుపడ దని, మహాకవులకే గ్రామ్యములు వ్రాసి రనునింద తప్పలేదని, యందువలన గ్రాంథికభాషను విసర్జింపవలయు నని చెప్పుటకలదు. ఎంతటిమహాకవులైనను నేదో యొండురెండుతప్పులుండక మానవు. త్రియంబకం అని వ్రాసినంతమాత్రమున కాళిదాసు గ్రంథములు చదువరా దని

యొట్టుపెట్టుకొనవలయు నన్న ట్లున్నవి. పండితులు పెక్కుదోషము లొనరించినపు డది వారిపాండిత్యలోపముకాని భాషయందులోపము కాదు. నాకు వ్యాకరణపరిజ్ఞానము సంపూర్ణముగ లేకపోవచ్చును. గ్రాంథిక భాషను దోషములేలేకుండ రచింపశక్తి చాలకపోవచ్చును. అంతమాత్రముచేత నెవ్వరును గ్రాంథిక భాషయే వ్రాయకూడదనుట యెట్లు? ఛందస్సు వ్యాకరము మొదలయిననియమముల ననుసరించుటకు శక్తి చాలక యందఱునట్లే రచింపవలయు ననుట భాష కంత మంచిది కాదు. ప్రబంధకాలపు కవులు కొందఱు శబ్దార్థాలంకారములపై ప్రీతిచేత దీర్ఘసమాసములు, కొఱుకుడుపడనిభాష రచించి యుండవచ్చును. అంతమాత్రముచేత మన మట్టిభాషనే వ్రాయ నక్కరలేదు. సరళగ్రాంథికములో వ్రాసినంతమాత్రమున తెలుఁగు భాష మృతభాష కాబోదు. పానుగంటివారిగ్రంథములు పఠించిన పండితు లాభాష యర్థము కా దందురా? రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారి రచనలు రమ్యములు కావని యెవ రందురు?

ఇక నేను చర్చింపదలఁచిన విషయ మిందొకటి యున్నది. వ్యావహారిక భాషావాదులు తమయభిప్రాయములను బలపఱచుటకు జెప్పినమాటలలో నితర భాషలలోగూడ వ్యావహారిక భాషనే యుపయోగింతు రనుట యొకటి. కాని పరిశీలనమువలన నది సత్యదూరమని తోఁచును. తమిళమున తెలుఁగు కంటె ముందుగ్రంథములు వెలువడినవి. వారిభాషపై మనకంటె ప్రీతి యెక్కువ తమిళులకు తమిళముననను నొక్కొక్కమండలమునకు భాషలో పెక్కుమార్పులు గోచరించును. మన వ్యావహారిక భాషావాదులు తమవాదమునుగూర్చి చెప్పుటకుముందు సోదరతమిళుల వ్రాతల నొక్కమాఱు పరికింపు డని మనవి.

మనభాషలోనుండి యిప్పుడుమాయమయిన ఱ యను నక్షరము తమిళమలయాళములలో నిప్పటికి నున్నవి. కాని వ్యవహారమున గొన్ని 'ళ' గను 'య' గను పలుకబడును. వారు మనవలె వ్యావహారిక భాషలో వ్రాయ దొడంగియున్నచో నిప్పటి కాయక్షరము తమిళము నందును సంతరించియుండును. 'తమిలుము'ను 'తమిళ మ'ని యొక మండలములోను తమియమని యొక మండలములోను వ్రాయవలసి యుండును. కాని యాయక్షరమును వారిభాషలో బ్రత్యేకమైనదిగ వారు తలంచి ఱ, కారముతోనే వ్రాయుదురు. మఱియు వ్యాసములు, కథలు మొదలుగునవి కూడ చాలవఱకు గ్రాంధికభాషలోనే యుండును. మాటలాడునప్పుడును చాలమంది చక్కని గ్రాంధిక భాషలో వచించుట మనము చూడవచ్చును. ఇందొకహాస్య మున్నది. ప్రస్తుతప్రభుత్వాధికారులుగ నున్న ద్రావిడమునేట్రకళగము, నందలి నాయకులలో వక్తలని పేరుగాంచినవా రందఱు చక్కగ గ్రాంధికమున మాటలాడువారే. నిత్యజీవితమున మనము సంభాషించు తీరున వా రుపన్యసించినపుడపుడు కృతికముగ నున్నట్లనిపించును. ఈవిషయములను గమనించినపు డితరభాషలలో గ్రంధములన్నియు వ్యావహారికభాషలోనే వ్రాయబడు చున్న వనుట యెంతసమంజసమో యెఱుంగుదురుగాక.

మలయాళభాషను గూడఁ బరిశీలించినపుడు వ్యావహారికభాషకు రచనావిషయమున వాడుభాషకు దప్పక కొంతభేదము కనుపట్టుచుండును. మలయాళమున పండితులను ప్రశ్నించినపుడు నేను తెలిసికొనినవిషయ మిది. ఏభాషయైనను మొదట చాలసరళముగనే ప్రారంభమగును. కొంచెము పురోగతి సాధించినపిదప దీర్ఘసమాసములు పాండిత్యప్రకర్షకై ప్రాకులాట కానిపించును. మఱల భాష సరళముగ నుండుటకై ప్రయత్నములు జరుగును. ఇది వా రిచ్చిన యభిప్రాయము. తెలుఁగు భాషలోఁగూడ నట్లే, ప్రబంధయుగమున సంస్కృతసమాసములపై ప్రీతిచక్రబంధ నాగబంధాదులపై మక్కువ

హెచ్చినది. కాని యట్టి భాషలోనే వ్రాయనక్కరలేదు. చక్కగ సుభోధమగు వ్యాకరణయుక్తమైన గ్రాంథిక భాషలో వ్రాయుట సమంజసము. అట్లు లేక నియమరహితముగ నెవరియిష్టమువచ్చినట్లు వారు భాష నుపయోగించికొనిన భాషకు దుర్గతి తప్పదు. ఇదియే యన్ని భాషలలోను సామాన్యముగ గానవచ్చుపద్ధతి. అదియే మన భాషలోను ననుసరణీయ మని మఱల మఱల వచించుచున్నాను.

(ఈ వ్యాసవిషయమున సహాయమొనర్చిన శ్రీ ప్రభాకరన్ నాయర్ ఎం. ఎ., గారికి నా కృతజ్ఞతలు)



## గ్రంధస్వీకారము – సమీక్ష

వ్యాసావళి – ప్రధమభాగము

పుటలు – 284+16. $\frac{1}{8}$ th Crown

మూల్యము – రు 5–50

కర్త – శివశ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రకాశకులు– శ్రీ నిర్మలశైవ సాహితీగ్రంథమాల, కాకినాడ–4.

శివశ్రీ శ్రీ బండారు తమ్మయ్యగారు నాకు మూఁడు శతాబ్దముల నుండి పరిచితులయిన సహృదయు లయినమిత్రులు. ఆంధ్రసాహిత్య పరిషత్తులో నే నడుగుపెట్టినదిమొదలు ఆ పత్రికానిర్వహణకార్యమందున్న నాకు వారిరచనలతో ప్రత్యక్షగసంబంధ మేర్పడియున్నది. ఆంధ్రదేశమున వీరశైవ మవతరించినదిమొదలు వాఙ్మయాభ్యుదయ మేగాక దేశాభ్యుదయముకూడ విశేషముగఁ గలిగిన దని, వాఙ్మయ విమర్శకచారిత్రకవిమర్శకులు ప్రగల్భములు పలుకుటయేగాని, ఆమత స్వరూపస్వభావములను దలస్పర్శిగాఁ దెలిసినవారు, తెలిపినవారు శ్రీ తమ్మయ్యగా రొక్కరే గల రనువిషయమును చాటి చెప్పునవి వారి రచనలు. ఇంతకు ముందవి వ్యాసరూపమున పత్రికలలోను ప్రత్యేకసంచికలలోను రూపొందియున్నవి.

శ్రీ బండారు తమ్మయ్యగారు మిక్కుటమైనశివభక్తిగలవారు. అట్టిభక్తితత్పరతయే వారిచే ఉత్కృష్టమైనశైవవాఙ్మయసేవ చేయించినది. శ్రీ తమ్మయ్యగారు రెవిన్యూడిపార్టుమెంటు ఉద్యోగిగా పనిచేయుచు, ఈవీరశైవవాఙ్మయమునుగూర్చి విశేషముగ శ్రమించి చారిత్రికసమన్వయముతోపాటు వాఙ్మయమును మథించి, విమర్శన వ్యాసములను వ్రాయుటయేగాక తామువ్రాసిన విషయములపై ఖండనమండనములను గూడ జేయుచు, నిరంతరముగ శైవవాఙ్మయ తపస్విగ రూపొందుట చాల విచిత్రమైనవిషయము. వారాంధ్రభాషామతల్లి కర్పించిన యలంకారము లన్నియు శివునకో శివభక్తాగ్రగణ్యులకో సంబంధించినవియే గాని, దానికి దూరమైన దొక్కటియుఁ గాదు. ఇది వారిదృఢమైన శివభక్తితత్పరతకు నిదర్శనము.

వీరశైవ మావిర్భవించినది వ్యాపించినది కర్ణాటకమునందే యైనను ఆనాఁడు పాల్కురికిసోమనాథుని తెలుగురచనలమూలముననే దానికి స్థిరత్వ మేర్పడినది. ఈ నాడును వీరశైవము విశేషముగ వ్యాప్తిలో నున్నకర్ణాటదేశమున ఆమతమునకు సంబంధించినగ్రంథము లేవి క్రొత్తగ వెలువడవలెనన్న దానికి శ్రీ బండారు తమ్మయ్యగారి ఆమోదముద్ర పడవలసినదే. ఈ విషయము నాకనుభవసిద్ధము. వీరశైవవాఙ్మయవిషయమున శ్రీ తమ్మయ్యగా రెంతటివిమర్శనము గావించినారో దానిలో కొంతభాగము నీవ్యాసావళి పాఠకలోకమునకు తెలియఁజేయగలదు. ఈ ప్రథమభాగములో ప్రకటితములైన వ్యాసములుగాక యిందు అనుబంధములో సూచించిన శ్రీ తమ్మయ్యగారి వ్యాసములన్నియు గ్రంథరూపమున ముందుభాగములలో బయటికి వచ్చి ఆంధ్రలోకమున కందిననాఁడు శైవమునకు సంబంధించినవిషయములలో కొఱవడియుండెడి దొక్కటియు నుండదనియే చెప్పవచ్చును.

ప్రస్తుతము వెలువడిన ప్రథమభాగములో పద్యభాగము, గద్యభాగములను రెండు భాగములున్నవి. వానిలో యీ క్రింది వ్యాసములు కలవు.

పద్య భాగము.

1. భరతధాత్రి 2. కళ్యాణపురీప్రశంస 3. బసవేశ్వరుడు 4. రెడ్డిపౌరుషము 5. ఆంధ్రిమలయరాజస్తవము 6. కాళిదాస ప్రశంస 7. చాటూక్తిముక్తావళి.

గద్య భాగము

1. మార్గదేశికవితలు 2. నన్నెచోడునికాలము, గురుస్తుతితత్త్వము 3. ధూర్జటి యాధ్యాత్మికత 4. పిడుపర్తి కవులు మల్లన–రాజశేఖరచరిత్రము 5. మాదయ్యగారిమల్లన 6. ఆంధ్రవాఙ్మయముపై శైవమత ప్రాబల్యము 7. శివపంచస్తవములు 8. కీ. శే. చిదిరెమఠము వీరభద్రశర్మగారు 9. వీరశైవవాఙ్మయము–తద్విశేషములు.

వారి చిరకాలపరిశ్రమకు ఫలితముగా పాల్కురికిసోమనాథుడు శ్రీనాథమహాకవి యనుగ్రంథములు వారు పరిష్కరించి ప్రకటించిన యితరకృతులు పాఠకవిద్యార్థిలోకమునకీవఱకే పరిచితములై యున్నవి. వానికంటెను ఈ వ్యాసావళీసంపుటములు మహోపకారులు కాఁగల వనుట ముమ్మాటికి సత్యం. పత్త్రికలలో నప్పటప్పట ప్రకటితములై కాలగర్భమున మాటుపడిపోకుండ నట్టి యుత్తమవిమర్శకవ్యాసములను గ్రంథరూపమునకుఁ దెచ్చిన తమ్మయ్యగారి కృషిని, ఆంధ్రపాఠకలోకమున కందిచ్చిన శ్రీనిర్మలశైవసాహితీగ్రంథమాలానిర్వాహకుల కృషి పరమప్రశంసనీయము. మిగిలిన వ్యాసావళీభాగముల నచిరకాలములో పాఠకుల కందిచ్చుపూనిక వారికిని, వెలుగులోనికివచ్చిన వచ్చుచున్న తమ సరస్వతీపూజాసుమమాలికలను కనులారఁగాంచు భాగ్యము శ్రీతమ్మయ్యగారికిని శంకరుఁడు ప్రసాదించుఁగాత.

చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ప్రతా:-ఏమే గిరికా! ఇటు వచ్చితివి. మనభవాని విజయవార్త తెలిసినదా ?

చతు:-( చి- త్ర- ము. (ఆంధ్రకేసరివర్మను గాంచును.)

మాధ:-చతురికా! నీవు లోని కేగి కొలదిగ శీతలోదకము దెమ్ము.

చతు:-(నిష్క్రమించును.)

మాధ:-ప్రతాపమహాశయా! ఆ పటగవాక్ష మొకింత తొలగించెదరా? వాయువు ప్రసరింపగలదు. పరవీరుని గదాహతిచే నీతనితల దిమ్ము వట్టి మూర్ఛితుఁ గావించినది. ఈతని శిరస్త్రాణమును దొలగించి . జలమున మొగమును దుడిచెదను.

ప్రతా:- తలపాగ దొలగించును.)

మాధ:-(చూచి ఆశ్చర్యముతో) ఆఁ ఆఁ ఎవ్వ రీమె ? ఆంధ్రకేసరి యంగనామణియా? ఆఁ.

ప్రతా:-(చూచి) ఆయ్యో! ఇది యేమి. ఈమె మా భవానియే.

(చతురిక జలపాత్రముతో బ్రవేశించును.)

ప్రతా:-చతురికా! చతురికా! చూచితివా ? మన భవాని యెంతగ సాహసించినదో (నీటితో మోము దుడుచును- భవాని కదలును) అమ్మా! తెలివి వచ్చినదా ? తల్లి! చూడుము- ఈ యభాగ్యుని దెస జూడుము. ఆంధ్రదుర్గశ నింతదనుక కనులు కాయలుగాయ చూచి చూచి యెట్లో బ్రదికి తుదకు నీ ప్రమాదపరిస్థితిగూడ చూచుచున్న యీ ముదుసలితండ్రిని చూడు.

మాధ:-ఆర్యా! ధైర్యము వహింపుడు- మూర్ఛ తొలగినది. అదిగో మీవంక నీక్షింపుచున్నది.

ప్రతా:-తల్లీ- చూడుము. నీకిపు డెటు లున్నది?

భవా:-(మెల్లగ) బాగుగనే యున్నది. తలదిమ్ము తొలగినది, ప్రమాదము లేదు- కాని- నాకై సంగరము మాని యిట నుంటిరా ?

ప్రతా:—లేదు తల్లీ! లేదు. యుద్ధము ముగిసినది. మన యాంధ్రులకే విజయము.

భవా:—(పెదవి కఱచి) బల్లహాకిరాతకుడు ?

ప్రతా:—ఖండింపబడినాడు. జయలక్ష్మి త్రిలింగసార్వభౌముని వరించినది.

మాధ:—ఆర్యా! అది మీ పుత్రికామణి సాయమున నే మీకృపవలన నే. నే నిందు నిమిత్తమాత్రుడను. ఈ వీరనారీతిలక మిపుడు మీ పుత్రిక యనిపించుకొనినది. మహాశయా! ఈమెను ప్రతాప కుమారి యనవలయునో లేక మిమ్ము భవానీజనకు లనవలయునో దెలియకుంటిని (నగును.)

ప్రతా:—అల్పసేవ కధికాభినందన మాసాదింపబడినన మా చిరంజీవిని యదృష్టశాలిని.

చతు:—(చేరి) అమ్మా! భవానమ్మా! దెబ్బ గట్టిగ తగులలేదుగదా!

భవా—లేదే— చతురికా!

ప్రతా:—తల్లీ—

మాధ:—మహాశయా! మన మావలి కేగి యీమె కొంకింత విశ్రాంతి నొసగ దగునేమో.

ప్రతా:—ఔను. చతురికా! నీవిచటనే యుందువుగాదా ?

చతు:—చిత్త మయ్యా!

(మాధవప్రతాపులు నిష్క్రమింతురు.)

(తెర పడును.)



# ఆంధ్రదీక్ష

## పంచమాంకము — తృతీయ రంగము.

ప్రదేశము:–మాధవవర్మ పటకుటీరప్రాంగణము.

ప్రవేశము:–మాధవవర్మ– ప్రతాపవర్మ–

మాధ:–ఎంత విచిత్రము! మహాశయా! వీరవేషము దాల్చినమాత్రనే మీతనయుని మీరే గుర్తింపలేకపోయితిరే?

ప్రతా:–తలమీరిన యింతటిపని తలపెట్టిన దని యెటుల సాహింపగలను. అనాహూతు లయ్యును నాంధ్రదేశాభిమానముచే నప్పటికప్పుడే యెందఱాంధ్రవీరులు మన సేవలో జేరియుండలేదు. ఆంధ్రకేరివర్మయు నట్టివాడే యనుకొంటిని గాని–

(నేపథ్యమున) మమ్ము వదలివేయుడు.

మాధ:–(విని) ఎవ్వరు వారు?

(ఇరువురు భటులు నాగరాజును లాగికొని వత్తురు.)

నాగ:–మమ్ము వదలివేయుడు. మేము మహాశూరులమే యైనను కోడిపిల్లనుగూడ కోయుట నెఱుగము. మనసంగతి శ్రీరాములు మొదలు చిత్తగించవలెనువఱకును మా చెన్నడు మీతో సెలవీయగలడు.

భటు:–మీ చెన్న డెవ్వడో మాకు తెలియదు. మీరు భీషణవర్మగారి కుమారులట. మా మహారాజుగారి సన్నిధిని మీరు మనవిచేసికొనవచ్చును.

మాధ:–(నగుచు) ఓహో! నాగరాజుగారేనా? (భటులతో) ఈమహాత్ము డెచట మీకు దొరకినాడురా?

భటు:–మహాప్రభూ! మమ్ము గని వారి కోళ్లగూటిలో దాగుకొనబోవుచుండ తమసన్నిధికి గొనివచ్చితిమి.

ప్రతా:–ఏమయ్యా! నీవును యుద్ధమునకు సిద్ధమైతివా?

నాగ:—లేదు, లేదు. మా రాజుకొంజు సాక్షిగ సెలవిచ్చుచున్నాము. మా కట్టియూహాయే కలుగదు. పిగిలిపిట్టలపోరుపై బీతియేకాని వీరులతో పోరాట మనిన మా కభ్యాసములేదు.

ప్రతా:—ఈతనిమొలలో నేదియో యున్నది. కైజారు కాబోలును. భటులారా! పరిశీలింపుడు.

నాగ:—ఆఁ ఆ. ఆగు డాగుడు. నేను మా చెన్నడును దక్క మా సామగ్రి నితరులు తాకిన పాడగును. మీరు కోరినారు గాన మేమే స్వహస్తములతో దీసి చూపెదము (చూపును.)

ప్రతా:—పచ్చముఖమలుగుడ్డచే జుట్టబడిన యిది కత్తివలె నున్నది. లాగుడు—

నాగ:—కాదు, కాదు, కోడికత్తులు పదునేనుదినములనుండి పందెములు లేక పదనుచెడి యున్నవి. ఇదిగో యీ చురకత్తి యూరులజెక్కుటకే కాని వీరుల జెక్కుటకు పనికిరాదు.

భటు:—ఈ సంచిలోనివికూడ దీసి యధికారులయెదుట బెట్టు డయ్యా!

నాగ:—ఇవియా? తోడ లరుగునటులు చచ్చిచెడి ముప్పేటగ బేసుకొనిన రంగురంగుల బొడ్డుదారములు. మీరు కోరినచో బరాతముగ దయచేసెదము.

ప్రతా:—ఏమయ్యా! నీవు శత్రుని పుత్రుడవు. నీకు శిరచ్ఛేదనశిక్షను మా ప్రభువులు విధించుచున్నారు.

నాగ:—అయ్యో! అయ్యో! మాకేనా? మే మేమి చేసితి మయ్యా? పోనిండు. మేము పోయిన మా కోళ్ల గతి యేలాగునయ్యా! పదును గనిపెట్టి తవుడుండలు చేయించి వేయించగల రటయ్యా!

భటు:—పడవయ్యా! ప్రభువులపాదములపై బడి ప్రార్థించుము.

నాగ:—ఓ. అభ్యంతరము లేదు. మాకుత్తరాంగము నధమాంగమును నొక్కటే.

మాధ:—ఆగుడు, భటులారా! గౌరవ మరయకుండ మీ రీయనతో మాటాడుచున్నారు. తప్పు, తప్పు. (ప్రతాపునితో) మహాశయా! ఈతడు మిగుల నమాయికుడు, కుక్కుటప్రపంచనివాసి.

నాగ:—(ఆనందముగ) అద్దీ! అద్దీ! మాసంగతి మహారాజుగారు మంచి చక్కగ మనవిజేసికొనినారు. ఓహోహో! ఏమి యదృష్టపుమొగ మయ్యా నీది. లోటాపావురమువలె నెంతనున్నగ నున్నావయ్యా! కోడిపుంజుజుట్టువలె నీపెదవు లెంత యెఱ్ఱగ నున్నవయ్యా!

ప్రతా:—నీవర్ణనము మండిపోను! ఊరకొను మయ్యా! నాగరాజుగారూ! మీ రిక నేమిచేయ దలచితిరి.

నాగ:—ప్రస్తుతము మేము జెట్టీపుంజులమాత్రమె జాగ్రత్త పరచి, తోలుగుడ్లు పెట్టుపెట్టల విడువ దలచుకొనినాము. మా పెండ్లి కూతురుగారును, నయ్యాగారును కాలముచేసినారు. మేము మాత్రము కోళ్లయాటంకముచే ప్రస్తుతము ప్రయాణభేరిమోగింప దలపకున్నాము.

మాధ:—ఈతని యమాయికత గనిక జాలి గల్గుచున్నది. ఈతనివలన నీగకైన నపకృతి లేదు— ఇల్లాలు లేదు, కన్నతండ్రి కడతేరినాడు— ఇక నా యని చెప్పదగినవా రెవరును నీతనికి లేరు. మహాశయా! ఇట్టివారల మనమే భద్రగతి గాపాడకున్న భగవానుడు మనల గరుణింపడు—

ప్రతా:—(నగుచు) ఈతని నొక్కనిమాత్రమే కాదు. కుక్కుటసంసార ముసో. అదియే లేకున్న నీతనికి మతి వోవును.

మాధ:—మతి యున్నగదా పోవుటకు! ఏమైనను నీతని కానందము గూర్చుచు బోషించుటయే మనవిధి.

నాగ:—అద్దిరే! సెనగపులుసువైచిన మాంసపుకూరవలె నీమాట లెంత రుచిగ నున్నవయ్యా! మంచివాడవు నీవు గనుక మా "పంచపక్షి" మహాగ్రంథమున కింతటినుండి నీవే భర్తవు. వెనుకటి కృతిభర్త

మా పెండ్లికూతురుగారు. వారిపేరుపై నడ్డముగ గీత గీసి యాపైన-ని స్నేక్కింప దలచితిమి. బాగుగ నున్నదా ?

మాధ:-మీ రేమియు శ్రమనందక మా కతిథులుగా నుండుడు. భటులారా! ఈతని సగౌరవముగ గొనిపోయి కుమారవర్మగారికిని, మధుసూదనవర్మగారికిని నప్పగించి మా యాశయము లెఱిగింపుడు.

భటు:-దేవా! చిత్తము.

ప్రతా:-వారెగో! మన సర్వసైన్యాధిపతులే యిటు వచ్చుచున్నారు.

మాధ:-ఔను. ఇచట కటకమున దగువారిని నిల్పి రేపు మ. న ము కందారపురప్రయాణము గావింప సన్నద్ధులము గావలసియున్నది. పోవుదమా.

(నిష్క్రమింతురు.)

# ఆంధ్రదీక్ష

## పంచమాంకము — చతుర్థరంగము.

ప్రదేశము:-కందారమున రాజభవనాంతర్భాగము.

ప్రవేశము:-వృద్ధమాధవశర్మ, మాధవవర్మ, సిరియాలదేవి, భవానీకుమారి, గిరిక.

వృ. మా:-అమ్మా! సిరియాలదేవీ! మన చిరంజీవి పరిణయమహోత్సవముతో బాటుగ బట్టాభిషేకోత్సవమును గూడ గనులార గాంచితిని. ఈవృద్ధున కి కేకోరికలును లేవు. ఇట్టి మహత్తరానందముతో నీ తనువును త్యజించెదను. నా కేక గావలసిన దేమున్నది ?

సిరి:-(నగుచు) అయ్యో! నాన్నగారూ! మునిమనుమనిగూడ చూచి యాశీర్వదింపకుండగ నే-

వృ. మా:-(ఆనందముతో) ఊరక యటులంటి నమ్మా! ఆతనిని మాత్రము ముద్దులాడకుండునా? తనువుల కంతముగాని యాసల కంత మేమి? (గిరికను గాంచి) ఇన్నియాసలును ఫలించుటకును నిట్టిమహోత్సవములను మన మరసి యానందించుటకును మూలాధార మీ మనగిరికయే కాదా? ఆంధ్రసామ్రాజ్య మీ మెవలననే కదా పునరుద్ధరింపబడినది.

గిరిక:-(కరముల జోడించి) బాబూ! ఈ యల్పసేవకురాలి కంతగౌరవ మిడిన భరింపగలదా? అంతయు తమ ప్రభావమే.

వృ. మా:-అబ్బాయీ! (సంశయించి) అయ్యో! మనుమడు మహారాజాయె నను మాట మఱచి యలవాటున నేకవచనమున సంబోధించితినే! సవరించుకొనవలెను- ఏమి? తాతా!

మాధ:-ఏమందును? మాతామహులకు మనుమనిపై నేటికి దయ తప్పిన దనుకొందును.

సిరి:-నాయనా! నాకు ప్రాణదాన మొనర్చిన మహాత్యాగి, నిన్ను పెంచి పెద్దగావించి కళాపరిపూర్ణు గావించిన యుదారమూర్తి యు నీమహానుభావులే కాదా? నా చర్మమును చెప్పుల గుట్టించి యిచ్చినను వీరిఋణమును దీర్పగలమా? రాము నాజ్ఞానుసారముగ భరతుడు వోలె యీ మీ తాతగారియానతి తల దాల్చియే నీవు పాలనాదికము నిర్వర్తింపవలసియున్నది నాయనా!

మాధ:-అమ్మా! ఈ దేహ మెవ్వరియన్నముచే నభివృద్ధి నందినది? ఈ రాజ్యమును సంపాదించి నా కిడినవా రెవ్వరు? మా తాతగారే కాదా? కావున రాజ్యపాలనక్రమముగూడ నుపదేశించుభారమును వారిదే! నా కేమిభయము.

వృ. మా:-తాతా! గుణవతియు- వీరవనితయు నగు మా భవాని రాజ్యలక్ష్మి ద్వితీయయై యేనాడు నిన్ను వరించినదో...

మాధ:-(నగుచు) ఆంధ్రరాజ్యలక్ష్మికూడ నిన్ను వరించె నని పలికి మీ మనుమరాలికి సవతిపోరు గల్పించుచున్నారేమి తాతగారూ!

వృ. మా:-వత్సా! వారి వివాదముల నీవు శమింపజేయ శ్రమనంద నక్కఱలేదు లెమ్ము. మా భవానమ్మ తానే రాజ్యలక్ష్మిని రావించువిషయమున శ్రమనంది యత్నించుటచే వారియంతరముల సామరస్య మేర్పడియే యున్నది.

సిరి:-భవానీ! ఇటు రమ్ము. (చేరదీసి) ఆంధ్రదేశమున జనించినయబల లెల్ల రణావనిలో కాళికామూర్తులని నిరూపించి యుంటివి. ఇందలి తృణముగూడ వజ్రాయుధ మని చాటితివి. ఇపుడు వీరపుత్రికవును, వీరనారీరత్నమును, వీరపత్నియు నైతివి. వేగమే వీరమాతవు గూడ నయి యుభయవంశములకును సంతతకీర్తిని సమార్జింపుము.

మాధ:-అమ్మా! ఓఢ్రదేశ మిపుడు మన యధీనమం దున్నది. దాని నేమి చేయుమని తాతగారి యానతియో తెలియకున్నది.

సిరి:-ఆ విషయమును పూజ్యపాదు లాదేశింపక మానెదరా?

వృ. మా:-ఆయుష్మంతుడా! వయసున చిన్న వయ్యును బుద్ధికి పెద్ద వగు నీ కుపదేశింప బనిలేదు. సామ్రాజ్యసౌధము ప్రజానందకర పాలనముపైననే యాధారపడియుండు నని నీకు తెలియకున్నదా? ఆంధ్రులు స్వీయరాజ్యపాలన మెట్లు వాంఛించిరో యోఢ్రులును నంతియే కదా?

మాధ:-కాని, తాతగారూ! కటకపురవీరు లనేకులు మనపాలనము నే మనసార గోరుచున్నా రని వింటిని.

వృ. మా:-పదవీవ్యామోహము గల కొందఱు ప్రముఖులు స్వార్థ పరతచే నటులే కోరవచ్చును. కాని యది యోఢ్రప్రజాబాహు ళ్యముయొక్క వాంఛితము కాదు.

మాధ:-ఔను. తమ రిపు డానతిచ్చినది పరమధర్మము. అటులైన బల్ల హుని జ్ఞాతులలో నొకడగుప్రబోధచంద్రునకు పట్టముగట్టుదమా?

సిరి:-నాయనా? యట్టియౌదార్యమే యవశ్యకర్తవ్యము.

వృ. మా:-వత్సా! మీ జనకులచే ప్రతిష్ఠింపబడి చిరకాలము పూజింపబడి నిరంతరమును మీ రాజకుటుంబముపై నపారకృపారసధారల జోరున గుర్పిమ్మరించుచున్న శ్రీసిద్ధేశ్వరస్వామి నీ యానందసమయమున నొక్కపరి మన మెల్లరమును నుచ్చైఃకంఠమున ప్రార్థింపవలదా ?

అందఱు:-ఓ, అవశ్యకర్తవ్యము.

వృ. మా:-(లేచి) జయ! జయ! మహాదేవ! శంభో! సిద్ధేశ్వరస్వామిన్!

ఉ. మానవకోటి సంకుచితమానససృష్టికి లేవివాడు రాట్
సూను డొకం డపారపరిశోభితతావకసృష్టి నున్నవా
డై నలువొందె నిట్లు ఘటనాఘటనాచరణప్రవీణ! ని
న్నే నుతియింపగాదగుదు నే? నిగమమ్ములె మిన్నకుండగన్.

సిరి:-

మ. ఒకనా డాంధ్రధరాధినాయకసపర్యోద్దీపితం బైన నీ
యకలంకాఘవిదారణాతిచణపాదాంభోజ మా భూపపు
త్రికుడే పూజ లొనర్పుకొంట కధికారం బున్నవా డానువం
శికమర్యాద దమింపగాబడును నె నీచే దేవ! సిద్ధేశ్వరా !

మాధ:-

మ. అనుకంపామతి మమ్ము బ్రోచుటకు నీయార్యం బ్రసాదించి యీ
ఘనుచే వైరివశంవదం బయినవిఖ్యాతాంధ్రరాజ్యంబు మ
త్పునరాత్తం బొనరింప జేసితివి సంపూర్ణంబుగా రాజ్యపా
లన కీతాతనె యూతగా నిలుప నాలక్షింపు సిద్ధేశ్వరా !

భవా:-దేవదేవా! ఆంధ్రసార్వభౌము నభ్యర్థనము జెల్లింపుడని శిరోనిహితాంజలినై యీభవాని మిమ్మర్థించుచున్నది.

గిరి:—తండ్రీ! సిద్ధేశ్వరా! ఆంధ్రదేశ సేవలకే మాతనువు లుపయోగ
మగునట్లు దీవింపుము మహాత్మా!

మాధ:—ఇపు డిక నవశిష్ట మేమి ?

సిరి:—ఇం కేమికలదు? ఆశీర్వాద మొండు:మాత్రమే-

మాధ:—అయ్యది తాతగారి యధీనమందే యున్నది కాదా?

వృ. మా:—ఇటు లగుగాక !

తే. గీ. ఆంధ్రదేశము సిరులతో నలరుఁగాక
ఆంధ్రభాషాభివర్ధనం బగునుగాక
ఆంధ్రమాత వీరసుతాళి నందుగాక
ఆంధ్రదేశీయసత్కీర్తి యలముగాక.

అందఱు:-తథాస్తు- తథాస్తు- తథాస్తు.

గద్యము.

శ్రీ మత్కాకరపర్త్యుపనామక కాశ్యపగోత్రోద్భవుండును, బాపనార్య
భిషక్సార్వభౌమపౌత్రుండును వేంకాంబికావేంకటరాయ విద్వన్మణి
పుత్రుండును, ర్వాణాంధ్రభాషావిరచితార్ధశతాధిక గ్రంథ
కర్తయు, కవిమూర్ధన్య, కవికంఠీరవ, ప్రౌఢకవిచంద్రాది
మహాబిరుదాంకితుండును నగు కృష్ణశాస్త్రిచే
విరచితమగు "నాంధ్రదీక్షా" నాటకమున
సర్వము ను సంపూర్ణము.
శ్రీ శ్రీ శ్రీ



అనన్వయాలంకారం లక్షయతి ఐక్య ఇతి. లక్షణం వ్యాకరోతి యత్రేతి. ఏవకారబలా దేకస్యా మే వోపమితి క్రియాయా మితి గమ్యతే. తే నోపమేయోపమాయాం రశనోపమాయాం చ నాతి వ్యాప్తిః. స్వస్య స్వేన ఉపమానాన్వేత త్యనన్వయ ఇ త్యన్వర్థం నామ భవతి. నను ద్వితీయసదృశవస్తునిషేధావిశేషా ల్లాటానుప్రసాదస్య కిం వైలక్షిణ్య మితి చే దుచ్యతే. అనన్వయే తు శబ్దైక్య మాచిత్యాదానుషంగికం రస్మిం స్తు లాటానుప్రాసే సాక్షా దేవ ప్రయోజక"మితి లాటానుప్రాసవ దనన్వయేపి శబ్దైక్యస్య నసాక్షాత్ప్రయోజకత్వ మితి భేదోఽవగంతవ్యః.

యథా

శ్లో. శ్రీమదాంధ్రమహావంశ సుధావారాశిచంద్రమః
సూర్యరాయేంద్ర తే కీర్తి స్త్వత్కీర్తి రివ శోభతే.

అత్ర ఏకస్యా ఏవ కీర్తే రుపమానోపమేయభావకల్పనా దనన్వయాలంకారః.

ఉదాహరతి శ్రీమ దితి. అత్ర చంద్రాదీనా ముపమానానగ్వాత్వ ద్యోతనాయ ఏకస్యా ఏవ కీర్తే రుపమానోపమేయతాప్రతిపాదనా ల్లక్షణసంగతిః.

ఉపమేయోపమాలంకారః

శో. పర్యాయేణ ద్వయో స్తచ్చే దుపమేయోపమా మతా.

ద్వయో రుపమానోపమేయయోః పర్యాయేణ ప్రకారాంతరేణ తృతీయవస్తువ్యవచ్ఛేదే నేతి యావత్. తదుపమానోపమేయత్వ ముపమేయోపమేతి లక్షణం. తథా చ నిరుక్తలక్షణస్య ప్రాప్తాంకరాజమండలకబళనతో యుగపదభ్యుపైతుమిధః శ్రీసూర్యరాయనృపతేః ఖడ్గో రాహు శ్చ సదృశ్యతా ముభయం అత్రయుగపదుపమేయోపమాయా మేక దైవ ఉపమానోపమేయాత్వనిర్దేశేన పర్యా

యౌగపద్యాభావా దవ్యాప్తి రితి పరాస్తం పర్యాయపదస్య తృతీయసదృశ
వస్తువ్యవచ్ఛేదపరత్వా దుక్తోపమాయాం నిరుక్తపర్యాయసత్త్వా
న్నావ్యాప్తిశంకా కస్యచి త్కృతంచి ద్ధర్మ ముపజీవ్య కేనచి త్సాదృ
శ్యే విహితే తస్యాపి తేన ధర్మేణ తత్సాదృశ్యస్య అర్థేపి తద్వర్ణనా
దనయో స్తృతీయసదృశో నాస్తీతి హి ఫలతి. స చ మంజుకాదిభి రత్ర
యౌగపద్యాభావోర్థః అత ఏవాత్ర వాక్యభేద ఇతి వాక్య ఏవ ఉప
మేయోపమో క్తేః కథం తృతీయసదృశవ్యవచ్ఛేదపరం తదితి వాచ్యం
మహాకవిప్రయోగేషు యౌగపద్యేపి తస్యా ఉపలభ్యమానతయా
మంజుకాద్యుక్తే రుపలక్షణపరత్వా ద్యది న తస్యోపలక్షణత్వే కించి
త్ప్రమాణం తథా యుగప దుపమేయోపమోదాహరణేఽపి మిథశ్శ
బ్దస్య అర్థపర్యాలోచనయా క్రమేణైవ రాహుఖడ్గయో రుపమానోప
మేయత్వప్రతీతే ర్మిథస్సదృశతా మిత్యత్రాపి హి. రాహుసదృశతాం
ఖడ్గసదృశతాం రాహో శ్చేతి యౌగపద్యాభావస్స్పష్ట ఏవ. అతో
నోక్తోదాహరణే వ్యాప్తిః. వస్తుత స్తు పర్యాయేణేతి పదం న లక్షణ
ప్రవిష్టం వైయర్థ్యా త్స్వరూపకథనమాత్రపరం తదితి ద్రష్టవ్యం. న
చ ద్వయో రుపమానోపమేయత్వరూపలక్షణ ముపమాలంకారాతి
వ్యాప్త మితి వాచ్యం. ఉపమేయోపమాయా స్సాదృశ్య అనుపమ
త్వద్యోతకతృతీయసదృశవ్యవచ్ఛేదోపమేయోత్కర్ష ఫలకత్వేన కవిసం
రంభగోచరతయా చారుత్వాపాదకత్వా న్నోక్తదోషః. అత ఏవోక్తం
సాదృశ్యప్రతీతిమాత్రోద్దేశ్యకకవిసంరంభ గోచరీభూతచారుసాదృశ్య
ముపమేతి వస్తుత స్తు పర్యాయేణ నిరుక్తార్థేన త దిత్యేకం ద్వయో
రుపమానోపమేయయో స్త దిత్యేకం లక్షణం తత్రాద్య ముక్త మేవ.
అన్య త్తు ఉభయప్రతియోగికైకం సాదృశ్య మిత్యుక్తవత్ శుద్ధోపమా
యా మతివ్యాప్తివారణా యోభయప్రతియోగికేతి ధీ రివ కీర్తిశ్శు
భ్రా కీర్తి రివ శ్రీ స్త్రిలోకమహనీయా శ్రీ రివ వాణీ శుభదా విశ్రు

త చరితస్య సూర్యరాయవిభో రితి రశనోపమాతిప్రసంగాభావా యైక మిత్యలం ప్రపంచేన.

అనన్వయమ్వై లక్ష్యేన వాక్యభేదాశ్రియ ముపమేయోపమాలంకారం లక్షయతి పర్యాయే ణేతి వ్యాకరోతి ద్వయో రితి. నిరుక్తాదీనా మైక్యప్రతిపత్తయే స్వయ ముదాహరతి ప్రాప్తేతి. సూర్యరాయ నృపతేః ఖడ్గో రాహు శ్చ ప్రాప్తాంకరాజమండలకబళనతః ఏకత్ర ప్రాప్తపతాకాదిలక్షణ రాజసమూహఖండనా దన్యత్ర ప్రాప్తకళంక చంద్రమండలగ్రసనా చ్చేత్యర్థః. మిథస్సదృశతాం సాదృశ్యం యుగప దభ్యేపైతి ప్రాప్నోతి. అత్రైకదైవ ఉపమానోపమేయత్వనిర్దేశేన పర్యాయాభావా దవ్యాప్త మిద మిత్యాశంక్య పరిహరతి పరా స్త మితి. తత్ప్రకార మేవాహ పర్యాయపద స్యేతి. పర్యాయపదస్య తృతీయసదృశవస్తుపరత్వే నోపమాయాం నిరుక్తపర్యాయస్య సద్భావా దిత్యర్థః. తావతా కిం ఫలతీ త్యాహ కస్యచి దితి. అనయో రుపమానోపమేయయోః మంజుకాదిమతే యౌగపద్యాభావేన వాక్యభేదే తృతీయసదృశవ్యవచ్ఛేదపరత్వం కథ మిత్యాశంక్య సమాధత్తే మహాకవిప్రయోగే ష్వితి సుగమ మన్యత్.

యథా

శ్లో. శ్రీసూర్యరాయేంద్రవదాన్యభావః
ప్రతాపవ ద్భాతి భవ త్యజస్రమ్
సోఽయం ప్రతాపోఽపి వదాన్యతావ
త్సఖ్యం గుణానాం తవ చిత్ర మత్ర.

అత్ర వదాన్యత్వప్రతాపయోః పరస్పరసాదృశ్యవర్ణనం తృతీయసదృశ వ్యవచ్ఛేదాయ భవతి.

ఉదాహరతి సూర్యరాయేంద్రేతి. హే సూర్యరాయేంద్ర భవతి త్వయి అజస్రం వదాన్యభావో వదాన్యత్వం దాతృత్వం ప్రతాపవత్ప్రతాపోపి వదాన్యతావద్భాతి యోజయతి అత్రేతి.

## స్మ ర ణా లం కా రః

శ్లో. సదృశానుభవా దన్యస్మృతి స్స్మరణ ముచ్యతే.

సదృశానుభూత్యా వస్త్వంతరస్మరణం స్మరణాలంకారః. సదృశాది భవా ది త్యనేన విసదృశచింతాదిజన్యస్మృతివ్యవచ్ఛేదః. స్మరణాలంకారం లక్షయతి సదృశానుభవా దితి వ్యాకరోతి. సదృశానుభూత్యేతి సదృశస్య పదార్థస్య అనుభవా త్సదృశవస్త్వంతరస్మృతి స్స్మరణాలంకారః. అదృష్టాదిజన్యలౌకికస్మరణేతి వ్యాప్తిం వారయతి. సదృశానుభవా దితి. సదృశవిశేషణేన సాదృశ్యవ్యతిరిక్తస్మరణస్య అనుభవవిశేషణేన అదృష్టజనితస్మరణస్య చ వ్యవచ్ఛేదాత్ న చానుమానే వ్యతివ్యాప్తిః. సదృశదర్శనా త్సదృశస్యైవ స్మరణ మితి వ్యాప్త్య భావాత్ సదృశదర్శనేన విసదృశస్యాపి స్మరణాత్.

య థా

శ్లో. శ్రీమ ద్వేంకట సూర్యరాయనృపతే ర్జేతుం కృపాణీలతామ్
క్షిప్రప్రోత్పాటితమత్తవారణశిరస్సంలీఢ ముక్తాఫలామ్
పశ్యంతః పరిపంథిభూపతిభటా స్సంస్ఫోటలీలోద్భటాః
దంష్ట్రాకోటికరాళవక్త్రకుహరాం కాళీం స్మరంతిధ్రువమ్.

అత్ర ముక్తాఫలాదిసదృశవస్తుదర్శనహేతుకదంష్ట్రాదిస్మృతిః సదృశవస్తుదర్శనహేతుకత్వం చ సదృశవస్తుదర్శనోద్బుద్ధసంస్కారజన్యత్వం న తు సాదృశ్యమూలకత్వ మి త్యుభయప్రధానసాధర్మ్యనిబంధనా నిరూపితాః ఉదాహరతి శ్రీమ దితి. క్షిప్రం యథాతథా ప్రోత్పాటితా విభిన్నా మత్తవారణా మదగజా స్తేషాం శిరోభ్యః కుంభేభ్య ఇత్యర్థః. సంలీఢాని సమాక్రాంతాని ముక్తాఫలాని యస్యా స్తాం జేతుః శ్రీమ ద్వేంకటసూర్యరాయనృపతేః కృపాణీలతాం పశ్యంతః సంస్ఫోటలీలాసు యుద్ధకేళిషు ఉద్భటాః కవిసంస్ఫోటసంయుగా ఇత్యమరః. పరిపంథిభూపతిభటా శ్శత్రురాజభటాః దంష్ట్రాకోటిభిః కరాళం భయం

కరం వక్త్రకుహరం ముఖరంధ్రం యస్యా స్తాం కాళీం ధృవం స్మరంతి. యో జయతి అత్రేతి ఉభయప్రధానసాధర్మ్యమూలానిరూపితా ఇత్యుపసంహరతి ఇతీతి.

## అ భా రో ప మూ లాః

అథారోపమూలేషు ప్రాధాన్యా త్ప్రథమం రూపకం నిరూప్యతే. అథ రూపకనిరూపణే సంగతి మాహ అథేత్యాదినా అథభేదాభేద ప్రధానసాధర్మ్యగర్భాలంకార నిరూపణానంతర మిత్యర్థః. నిరూపణీయా నుద్దిశతి ఆరోపమూలే ష్వితి. అభేదప్రధానసాధర్మ్యగర్భే ష్విత్యర్థః. తేషు రూపకస్య సంగతి మాహ ప్రాధాన్యా దితి. ఆరోపమూలాలంకారబీజభూతత్వే నేతి భావః.

## రూ ప క ల క్ష ణం

శ్లో. విషయానిహ్నవేనాన్య స్యారోపే రూపకం మతమ్.

అన్య స్యాప్రకృతస్య ప్రకృతే విషయాపహ్నుత్యా యదారోపణం తద్రూపకం తత్రాభేదస్య ప్రాధాన్యమాత్రం వస్తుతో స్త్యేవ భేదః, తే నానన్వయాలంకార వ్యావృత్తిః. తత్ర విషయానిహ్నవేన ఆరోప ఇత్యనేన అతిరోహితస్య విషయస్య ఆరోప్యమాణోపర క్తత్వం వివక్షితం తథా చ విషయాతిరోధాంశేన సందేహభ్రాంతిమదపహ్నవానాం వ్యావృత్తిః, సందేహాలంకారే విషయస్య సందిహ్యమానతయా విషయతిరోధానం భ్రాంతిమదలంకారే భ్రాంత్యా అపహ్నవేఽపహ్నవేన విషయతిరోధానం ఉపరక్తిత్వ మిత్యనేన పరిణామాలంకారవ్యవచ్ఛేదః. తత్రారోప్యమాణస్య ప్రకృతోపయోగితయా విషయపరిణామరూపత్వేన ప్రకృతోపరంజకత్వాత్ ఉత్ప్రేక్షాదే రధ్యవసాయమూలత్వా దస్య ఆరోపమూలత్వా త్సర్వేభ్య స్సాదృశ్యమూలేభ్యో విలక్షణ మేతత్.

తస్య లక్షణ మాహ విషయానిహ్నవే నేతి శేషా నంశాన్ పూరయన్ వ్యాకరోతి అన్యస్యేతి. అన్యస్య అప్రకృతస్య చంద్రాదే రిత్యర్థః. ప్రకృతే ముఖాదౌ విషయాపహ్నుత్యా విషయమనపహ్నుత్యై వేత్యర్థః. యథా ముఖచంద్ర ఇత్యత్ర విషయనిహ్నవ మంతరే ణైవ విషయీ విషయే సమారోప్యతే తద్రూపక మిత్యర్థః. అత ఏవ విషయీవిషయ మాత్మనా రూపవంతం కరోతీతి రూపకశబ్దప్ర వృత్తిః. అనన్వయాతివ్యాప్తివారణాయ భేదో విద్యత ఇత్యాహ తత్ర భేదస్యేతి. విషయానిహ్నవేన ఆరోప ఇత్యనేన చ కిం వివక్షిత మిత్యత ఆహ. తత్రవిషయానిహ్నవే నేత్యాదినా ఏతద్వ్యవస్థాయాం కిం ఫల మిత్యత ఆహ తథా చేత్యాదినా. విషయతిరోధాన మిత్యం తేన ఉపరక్తత్వం చ తాద్రూప్యమాత్రజనకత్వం తావతైవాత్ర ఆరో పస్య చారితార్థ్యాత్ తేన పరిణామవ్యవచ్ఛేదకత్వం సంభవతీ త్యాహ ఉపరక్తత్వ త్వనేనేతి హేతు మాహ తత్రేత్యాదినా పరిణామవదా రోపస్య ప్రకృతోపయోగిత్వాభావా దితి భావః. తదుక్తం అన్యాపహ్నుతరూపస్య విషయ స్యోపరంజనం భవే ద్విషయిణా యత్ర రూపకం తత్ప్రకీర్త్యత ఇతి. అన్యత్రాప్యుక్తం తత్ర విషయిరూపేణ రూపవాన్విషయో యతః ఆరోపణేన క్రియతే తేనైతద్రూపకం మత మితి. సుగమ మన్యత్.

త ద్వి భ జ తే

తత్రాన త్రివిధం సావయవం నిరవయవం పరం పరితం చేతి సావయవం ద్వివిధం సమస్తవిషయ మేకదేశవర్తి చేతి నిరవయవ మపి ద్వివిధం కేవలం మాలారూపం చేతి. పరం పరితస్యాపి శ్లిష్టశబ్ద నిబంధనత్వేన అశ్లిష్టశబ్దనిబంధనత్వేన చ ద్వైవిధ్యే తయో రపి ప్రత్యేకం కేవలమాలారూపేణ చాతుర్విధ్యే తదేవ మష్టవిధం రూపకం.

ఏవం సర్వవిలక్షణం రూపక మిత్యాఖ్యాయ తద్విభాగ మాహ తత్రాన దితి.

తేషాం స్వరూపోదాహరణాని సావయనం

అవయవావయవిసాకల్యావృత్తిసావయవమ్.

సావయవస్వరూప మాహ అవయవేతి. అవయవానా మవయవిన శ్చ యత్ర శబ్దే నోపాదానం తత్సమస్తవస్తువిషయం సావయవ మిత్యర్థః.

యథా

శ్లో. శ్రీసూర్యరాయాధిపతి స్సురద్రు
శ్శాఖాభుజామండల మస్య తస్య
కీర్తి స్తదీయా కుసుమోద్గమశ్రీ
స్సైన్వైరం విభాతి క్షితిమండలేఽస్మిన్.

అత్ర సూర్యరాయమహారాజస్య సురతరుత్వ మారోప్య తదుచితావయవనిరూపణా త్సమస్తవస్తువిషయం సావయవమ్.

సమస్తవస్తువిషయం సావయవ ముదాహరతి శ్రీసూర్యరాయాధిపతి రితి సమస్తవస్తువిషయత్వం యోజయతి అత్రేతి.

ఏకదేశవర్తిసావయవమ్

యదా తు కించిచ్ఛ్రుత్యా కించి దర్థా చ్చోపనీయతే త దేకదేశవర్తి సావయవం.

ఏకదేశవర్తిరూపకం లక్షయతి యదా్యేతి ఉపలక్షణ మేతత్. తేన యథా యోగ మవయవావయవినో రేకదేశస్య శాబ్దత్వార్థత్వా మేకదేశవర్తిరూపక మితి లక్షణం. అత ఏవ కావ్యప్రకాశకారః శ్రౌతా ఆర్థాశ్చ తే యస్మిన్ ఏకదేశవివర్తి త దితి ఏకదేశవిశేషేణ వర్తనా దేకదేశవివర్తీ త్యర్థః.

యథా

శ్లో. భువనోద్గతతాపహారై
స్స్నపయన్ ఘనకీర్తికౌముదీసారైః
శ్రీరావువంశజలధే
ర్జాత శ్శ్రీసూర్యరాయభూపాలః.

అత్ర కీర్త్యాదిషు చంద్రికాద్యారోపణప్రత్యా సూర్యరాయభూపాలే చంద్రత్వ మర్థా దుపనీయత ఇత్యేకదేశవర్తి.

ఉదాహరతి భువనేతి. యోజయతి అత్రేతి. అవయవరూపణా దవయవరూపణం గమ్యత ఇతి సావయవ మేకదేశవర్తీత్యర్థః.

నిరవయవమ్

య త్రావయవరూపణమాత్రేణ కవిసంరంభవిశ్రాంతి స్త న్నిరవయవం. నిరవయవయం లక్షయతి యత్రేతి. పూర్వత్రావయవమాత్రే న్యత్రావయవాంతరే చ రూపణాభావా న్నిరవయవ మితి భావః. అత్ర కస్యారోపవిషయ స్యైక మేవారోప్యమాణం చే త్కేవల మనేకం చే న్మాలేతి ద్విధా.

కేవలం యథా

శ్లో. సూర్యరాయేంద్రమందారమ్
యే భజంతి చరాచరే
తరంతి దుస్తరం వై తే
లోకా దారిద్ర్యవారిధిమ్.

అత్ర సూర్యరాయవిభో ర్మందారకత్వం దారిద్ర్యసాగరత్వం చ నిరూప్యతే తదవయవాదికం కించిన్న నివేశ్యత ఇతి కేవలం నిరవయవం.

ఉదాహరతి సూర్యరాయేంద్రేతి సూర్యరాయేంద్ర ఏవ మందార స్తం చరాచరే జగతి యోజయతి అత్రేతి.

మాలాయా యథా

శ్లో. విశ్వాసభూమి ర్వినయస్య వాసో
రాజ్యశ్రియః కల్పతరో ర్ద్విరుక్తిః
త్రాతాస్య మూర్తో జయతీహ లోకే
శ్రీసూర్యరాయాధిపసార్వభౌమః.